ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము.

అనుబంధగ్రంథమాల. 31.



# సమస్య.

ఇది

(కర్ణాటకభాషనుండి)

బాలాంత్రపు వేంకటరావుగారిచే

ఆంధ్రీకరింపఁబడినది.

అయ్యగారి నారాయణమూర్తి బి. ఏ. బి యల్ గారిచే

సంపాదింపఁబడినది.

మొదటికూర్పు.

నిడదవోలు

ఆంధ్రప్రచారిణీముద్రాక్షరశాలలో

ముద్రింపఁబడినది.

1916

వెల రు 0—2—0.

శ్రీరామచంద్ర.

# సమస్య.

---

౧

ముద్రాలయమువారితోఁ జాలకాలము పోట్లాడి, "బంగాళాజ్యోతి" యను పత్రికయొక్క నవరాత్రిసంచికను దుర్గాపూజకుముందుగనే ప్రకటింపవలసియుండుటచే నేను చాలశ్రమలకు లోనైతిని. నేను కార్యనిర్వాహకునితో "ప్రతులను టపాకుఁ బంపించుఁడు" అని చెప్పుచు నావిషయమునుగూర్చి మాటాడుచుండఁగా, సతీశబాబు దొరగారివస్త్రులవంటివస్త్రులనుదాల్చి "సిగరెట్టు" ను గాల్చుచు నాయెదుటికివచ్చి నిలిచెను. వచ్చినవాఁడు "డార్జిలింగునకు బయలుదేరి పోదమురమ్ము." అనియెను.

సతీశుఁడు నాకు బాల్యస్నేహితుఁడు. మేమిరువురమును సహాధ్యాయులము. ఒక్కచోటనేయుండి విద్యాభ్యాసము చేసితిమి. మేమిరువురమును బాలుఁగొంటెపనులను జేయుచుండెడివారము. మాచేష్టలను గనిపెట్టి మాయుపాధ్యాయుఁడు మమ్ములనిరువురను గరటకదమనకులని పిలుచుచుండెడివాఁడు.

మెట్రిక్యులేషన్ పరీక్షయందు ఉత్తీర్ణులమై మేము కలకత్తాకళాశాలకు వచ్చితిమి. అప్పటినుండియు, మా జీవనమార్గమునందును, నడవడులయందును సతీశునకును నాకును జాల వ్యత్యస్తభావము గనబడుచుండెను. సతీశుఁడు ప్రతివిషయమునందును, ఆంగ్లేయపద్ధతులనే యవలంబించువాఁడు—నేనో—నామాతృభాషయందు విశేషగౌరవమునుంచియుంటిని. సర్వదా బంగాళాపుస్తకములనే చదువుచు, దేశభాషలోఁ జిన్నచిన్నవ్యాసములను వ్రాయుచునున్న నన్నుఁ జూచి, సతీశుఁడు నిత్యమును బరిహాసము చేయుచుండెడివాఁడు. మాటిమాటికిని, ఆతని విజాతీయానుకరణమునుగూర్చి హద్దులేకుండ నేనాక్షేపించుచుండెడివాఁడను. పిమ్మట సతీశుఁ డింగ్లాండునకుఁబోయి న్యాయశాస్త్రమునందుఁ బరీక్షనిచ్చి, గొప్ప బ్యారిష్టరై, యిక్కడకుఁ దిరిగివచ్చెను. అంతటితో నాతని యనుకరణచరిత్రము సాంగమైపోయినది.

మేమిప్పుడు బాల్యమునందున్నట్టువలెనే, ఏకశరీరులమై, ఏకహృదయులమైయుండ లేదు. సతీశుఁడు సంపూర్ణముగా మారిపోయెను. మునుపటివలె నాతఁడు తనయాలోచనములనుగూర్చి నాతో మాటాడుటలేదు. అయినను, మా స్నేహాచారములకేమియును లోపము లేకుండ నుండెను. సతీశుఁ డిట్లనియెను.

"డార్జిలింగునకుఁ బయలుదేరుము."

"నీవెప్పుడు పోయెదవు ?"

"ఇప్పుడే."

"అయ్యో ! ఇప్పుడెన్నిగంటలైనది ?" మునివ్రేళ్లతో సిగరెట్టును గరచి పట్టుకొని సతీశుఁడు తనజేబుగడియారమును బైకిఁదీసిచూచి "ఇప్పుడు పదిగంటలుమాత్రమే. పొగబండి నాలుగుగంటలకుసరిగా బయలుదేరును. ఆఱుగంటలు—360 నిమిషములు—ఒక పెద్దపెండ్లి చేయుటకవకాశమున్నది.

"మిత్రమా ! నీవు తెల్లటోపి దొరగారవైతివి. నేను నల్లవాఁడను— నీవన్నిఁ బనులనన్నిటి నంత శీఘ్రముగఁ బూర్తిచేయఁగలనా ? స్నానముచేసి, భోజనము చేయుసరికే పండ్రెండుగంటలగును. తరువాత స్వల్పనిద్ర—"

"పిచ్చిమాట ! ఈ నెపములను నాముందుఁ జెప్పఁబోకుము !"

"డార్జిలింగునకుఁ బోవలసియున్నచో, రెండుదినములకుఁ బూర్వమే నాకేలనులకుఁ జెప్పవైతివి ?"

"డాక్టరుసేనునుండి యాహ్వానము వచ్చిన దీదినముననే—ఇప్పుడే."

"డాక్టరుసేనుడార్జిలింగునం దెక్కడనుండును?-కుటుం

బముతోఁడ నేనా?— ఆతనికుమార్త?— ”

సతీశుఁడు నవ్వుచు “ గోవువెనుక నేతోక యుండును ” అనియెను.

డాక్టర్ సేనునికూఁతురు—విద్యావతియగు నామోహిని నాస్నేహితుని దనవలపుఁబలుకులఁగట్టివైచినదనుమాట బహిరంగరహస్యమే—కష్టమువచ్చినది! నాలుగుగంటలవఱకును గనిపెట్టుకొనియుండవలయును. అప్పటికిఁ గాని బండి బయలుదేరదు—నేనిట్లుపాడఁదొడఁగితిని—

“ ఉల్లమున నెంతొ నిన్ను రే • యుంబవళ్లు
కాని, జరుగవు నాకవి • కలికిమిన్న! ”

ఇదివఱకే స్త్రీమీఁదను బ్రేమకలవాఁడనుగాకపోయినను, పరిణయస్వభావమెట్టిదైనదియు నేను బాగుగనెఱింగియుంటిని. ఇఁకనొకనాఁడు వచ్చెదనని చెప్పుట బాగుగనుండదనియోచించుకొని, నేనక్కడకుఁబోయితీరవలయునని నిశ్చయించుకొంటిని. జాగరూకతతో నాబట్టలు మొదలగునవి పెట్టెలోవైచుకొంటిని. నాలుగుగంటలబండికి మేము బయలుదేరిపోయితిమి.



౨

డార్జిలింగు రైలుస్టేషనునకు బండివచ్చునప్పటికి డాక్ట
రుసేను, భార్యతోడను, కుమారైతోడను, ప్లాటుఫారము
మీఁద నిలిచియుండుటను నాకన్నులార నేనుచూచితిని.
బూట్సును, మేజోళ్లను దొడుగుకొని, బంగాళాకన్యక యొ
క్కతె, ఆజనసమూహముమధ్య బహిరంగముగా నిలిచి
యుండుటనుజూచి, నేనించుకచకితుఁడనైతిని. నాజీవమాన
ముం దెందఱినో బ్రహ్మసమాజస్త్రీలను నేనుచూచియుం
టిని. ఒకరిద్దరిపరిచయముకూడ నాకుఁగలదు. ఆకారణము
న నీవిషయ మంతక్రొత్తదిగా నాకగపడలేదు. అయినను,
సతీశునిభార్యకాఁబోవునామెను, అత్తను, ఇట్టినూతనపద్ధతు
లలోఁజూచుట, నాకువజ్రాఘాతమువలెనుండెను. నేను స్త్రీ
విద్యాభ్యాసమునకు విరోధముగ మాటాడువాఁడనుగాను.
కాని, పూర్వసంప్రదాయకమగు "జనానా" పద్ధతిని బొ
త్తిగవిడిచివేయుటయనిన నేనించుకంతయు సహింపలేకుం
డనుంటిని. ఈవఱకే యీవిషయమునుగూర్చి నేనొకలేఖను
బ్రకటించియుంటిని. ఇప్పుడుగూడ నావిధమగు విషయము
నుగూర్చిన విమర్శనమునేచేయుచు, మనస్సున నూతనాలో
చనములఁగూడఁ బెట్టుకొనుచుంటిని. క్రూరమగు — తీక్ష్ణ
మగు — అనేకశబ్దములు, తమంతటనవియేవచ్చి నాతల

లోఁ జేకికొనుచుండెను. కాని, యుత్తరక్షణముననే యవి యెక్కడకో చెదరిపోయినవి.

రైలునుండిదిగి సతీశుఁడు నాపరిచయమును దనమిత్రమండలియందుఁ బ్రకటించెను. ఆజాతిస్త్రీలతో నెప్పుడును జేరినవాఁడనుగాకపోవుటచే నాయుద్యోగమునందుం డఁదగినవాఁడు. ఏమిచేయవలయునో యనుదానిని నేను తెలిసికొనఁజాలకపోయితిని. ఒక్కమాటయైన మాటాడకుండఁగఁ గేవలము పిచ్చివానివలె ప్లాటుఫారముననొకమూల నొకచెట్టుమొదట నిలుచుండియుంటిని.

అంతలో మోహిని సమీపమునకువచ్చి చిఱునవ్వు నవ్వుచు " మనోహరబాబూ ! మీపత్రికను నేను గ్రమముగఁ జదువుచున్నాను ! " అని మరలనేమియో చెప్పఁదలఁచి- ఏకారణముననో యామెమాటనాపివైచెను. మోహినితల్లి "బంగాళాజ్యోతియొక్కపూజాసంచిక యెప్పుడుబయలుదేరును ? " అనియడిగెను.

" ఈవఱకే బయలువెడలినది " అని నేనంటిని.

ఆమె మోహినిముఖమునుజూచి " నీకువచ్చినదా ?" అని యడిగెను.

" ఇంకనురాలేదు "

" దయయుంచిక్షమింపుఁడు ? మీపత్రికవచ్చుటకిం

కను సమయముకాలేదు. నిన్ననే యది బయలువెడలినది. అన్నిపత్రికలను నొకేసరి మేము పంపించుటలేదు"

మోహిని " అఁనను. నాపత్రి మొదట డాక్టరుఁ బోయి పిమ్మట నిక్కడకువచ్చిచేరును. మనోహరబాబూ! మీయొద్దఁబత్రియొకటి లేదా?" అనిరెను.

"బంగాళాజ్యోతి" యందు మోహినికిఁగలయభిరుచినిగ్రహించి సంపాదకీయముగు నాయాత్మ సంతోషించెను. "ఉన్నది. రేపటిదినమునఁ బంపించెదను." అని చెప్పితిని.

" తొందరపడకుఁడు. మీకువీలుగనున్నప్పుడే పంపవచ్చును" అని యామె ప్రత్యుత్తరమిచ్చెను.

సేనగారిభార్య — మనోహరబాబూ! ఈమధ్యాహ్నము మీరు మాయింటఁ జేయుఫలహారమును గ్రహింపవలయును గ్రహింపుఁడు" అనిరెను. నిత్యాచారమర్యాదతో నేను వారి యాజ్ఞనుబొందినపిమ్మట వారు వెడలిపోయిరి.

విద్యాభ్యాసప్రాబల్యమింతగఁ దలమీఱిపోయినదే! మానవతియగు నొకబంగాళాకన్యక యపరిచితుఁడగు నొకగొప్పగృహస్థునితో భయములేకుండ కళవళపడకుండ నింతటిధైర్యస్వాతంత్ర్యములతో బహుసులభముగ మాటలాడెడికాలము తోఁపికొనివచ్చినదా?" అని యోచించుచు నేను సత్రమునొద్దకుఁ బోయితిని. రాత్రి శయ్యపైఁ

బయుండి యన్నో, యెన్నియో సాంఘికవిషయములనుగూర్చి యోచింపఁదొడఁగితిని — " అర్వాచీనవిద్యాభ్యాసమునకుఁ బ్రతిఫలముగా రాఁదగిన యీ వేషభాషలనుండియు, నీయాం చారవ్యవహారములనుండియు, దేశమునకుఁగలుగు బ్రయోజనమేమియున్నది ? కాక, దీనియంత్యఫలితాంశ మేమి ? — ఆలోచనము చాలదూరముపోవుటకుముందే నేను నిద్రాపరవశుఁడ నైతిని.

---

3

మఱునాఁటి యుదయమునఁ దేయాకునీటిని బుచ్చుకొనుచు నిన్నటివిషయములనుగూర్చి సమాలోచనము చేసి చూచితిని. ఇట్టిస్త్రీపురుషుల స్వేచ్ఛాప్రవర్తనము సాంఘిక నీతిసూత్రములను సర్వవిధముల హానిగలుగఁజేయునని భావించితిని. ఆ కారణమునఁ దేయాకునీటిని ద్రాగుట కక్కడకుఁ బోరాదని నిశ్చయపఱచుకొంటిని. నేను నావిశ్వాసమునకువిరోధముగా నెందులకు నడవవలయును ? " బంగాళా జ్యోతి " ని సేవకునిచేఁ బంపవచ్చును. కాక, సతీశుఁడువచ్చినచో నాతనికీయవచ్చును. కాని, సతీశుఁడా ! ఇఁక నెక్కడ ? నాకు ముఖము నేచూపించుట లేదు ! బహుశః మోహినిని విడిచి రాఁజాలకుండనోపు ! వారి వారి ప్రణయసం

భాషణములనుమనస్సునందే చిత్రించుకొనుచు, విశేషవినోదము ననుభవించుచుంటిని.

భోజనమైనపిమ్మట— నేను, ఈతేయాకునీటినిద్రాగువారితోఁజేరకున్నచో నాపడవడికవిషయమున నేమైన మర్యాదలోపముసంభవించునేమో? —" అను ననుమానముకలిగెను. ఆహ్వానమునుస్వీకరించుటచే నవశ్యమువారున్నచోటికి నేను పోవలసివచ్చెను. అదినాయిష్టమునకు విరుద్ధముగనున్నచో నేనప్పుడే "వచ్చుటకువలనుగాదు" అనిచెప్పివేయవలదా? ఆహ్వానమునుస్వీకరించి నేనెట్లుపోకుండనుండఁగలను?

ముందెన్నఁడైన నిట్టివిషయములకొప్పికొనవలసివచ్చినచో నేను మిగులజాగరూకుఁడనై యుండవలయునని యనుకొనుచు నక్కడకుఁబోవుటకు సంసిద్ధుఁడనైతిని. ఉడుపులనుధరించుటలో నేనించుకజాణతనమునే చూపింపవలసియుండెను. "పురుషులసంఘమైనచో వీనియందు విశేషముగ మనసుంపనక్కఱయుండదు. కాని, స్త్రీలమధ్య—" అని నాలోనేననుకొంటిని. అనేకపర్యాయములు నేను డార్జిలింగునకుఁబోయియుంటిని. ఆవీథులన్నియు నాకుబాగుగఁదెలియును. నాలుగుగంటలకింకను బదినిమిషములుండఁగనే నేను వారిగృహమునకుఁబోయితిని. నియమితసమయము

సకింకను బదినిమిషములున్నవి! ఇట్లనియోచించుకొంటిని. " వీరందఱును ఆంగ్లేయసంప్రదాయముననుసరించువారు. సమయమునకుముందుగనే లోపలకుఁబోయి యడవివాను ష్ఠుఁడనని నేనేలయనిపించుకొనవలయును?" అని యెంచు కసేపటునిట్టుఁదిరిగి నాలుగుగంటలకుసరిగ నావిలాసముగల కాగితమును లోపలకుఁబంపితిని.

వారు నన్నులోనికి రమ్మనివర్తమానమంపిరి. దేశ భాషాపత్రికాధిపతుల కిట్టిసుశిక్షితమండలియం దింతటి గౌరవముండుటంజూచి యెంచుక సంతోషించితిని.

నేఁడు మోహినితనసౌందర్యముచే జగత్తు నేమోహింపఁజేయునట్లుగానుండెను. నాఁడు రైలుస్టేషనునందు, ఆ యింగ్లీషుదుస్తులతోనున్న యాయువతినింజూచినప్పుడు నాకొకవిధమగునసహ్యముగలిగెను. నేఁడామెవంగపంచుచాయచీరనుగట్టి, కేశపాశమునందు వికసించినగులాబిపుష్పమును ముడుచుకొనియుండెను. మోహిని నిజముగానేఁడు మోహినియైయుండెను.

వచ్చినతోడనే సతీశునిజూచి, యాతనినుద్దేశపూర్వకముగ వెదకిపట్టుకొని, యాతనిదేవీచరణసరోజసేవావిషయమునుగూర్చి చమత్కారముగ మాటాడవలయునని నిశ్చయించుకొంటిని. కాని, యాతడాయుత్తరక్షణముననే లోప

లక్షిఁ బోయియుండుటచే నాజనసమూహమునందు నాచమ
త్కారపేటికను దెఱచుటకు వీలుపడినదికాదు. తేయాకునీటి
ని ద్రావుటయైనది. సభ్యసంభాషణముగూడనైనది. అటు
తర్వాత మేమందఱమును వాయుసేవనమునకై బయలువెడలితి
మి. బయలుదేరుటకనుష్ఠను వేమనప్పుడు డాక్టరు సేనుగారి
భార్య నన్నుఁజూచి "బాబూ! ఱేపుగూడ నీసమయమున
కే వచ్చినచో నిన్ను వినోదింపవచ్చును" అనియెను. ఈమె
యాహ్వానమును స్వీకరించుటయందు నేను చాల జాగరూకుఁ
డనైయుంటిని. దానిని స్వీకరింపకుండుటకుఁ గారణమిట్టిదని
నానోటితో నేనేల చెప్పవలయును? నాయభిప్రాయమంత గు
ప్తముగానడఁగియున్న యూసాంఘికతత్వమును వారికెఱిం
గించుటకు ఱేపటిదినమున నేను వారియొద్దకుఁ బోవకతప్ప
దని యనుకొంటిని. కాని మఱల యోచించుకొంటిని. ఇది
యెట్టి యాహ్వానము? "నీవువచ్చినచో" అనియా నన్నుఁ
బిలువవలసినది? ఈ "చో" అనుదానికర్థ మేమున్నది?
అని యనేకవిధముల నామనమునఁ దర్కించుకొనుచు నా
మెకుఁ బ్రత్యుత్తరమీయఁజాలకపోయితిని. ఆమె మర్యాద
పూర్వకముగ నాకు నమస్కరించి వెడలిపోయెను.

---

## ౪

పదిగంటలకు సతీశుఁడు నాయొద్దకు వచ్చెను. "అయ్యా! ఎట్లువచ్చితివి? మోహిని నిన్ను రానిచ్చినదా? లేక విడిచిపెట్టినదా? ఎన్నినిమిషముల అనుజ్ఞను పొందివచ్చితివి? ఒక్కని నేపంపుట కామె యెట్లుసమ్మతించినది?" అని యడుగఁగా "అదేమి! నీయవలక్షణపత్రిక! బంగాళాదర్పణమా!—జ్యోతియా!—ఏమివిచిత్రము!—దానితోనే పెనఁగులాడుచున్నది!—మాటాడుకొనుటకైన నవకాశము లేదు. విసిఁగివిసిఁగి యిచ్చటకు వచ్చితిని." అనియెను.

నేను బ్రహ్మానందమునందితిని. మోహినికి దేశభాషయం దెంతటియాదరము!—ఆమె యేవిధమైన నుపన్యాసములు వ్రాసినచోఁ దప్పులనుదిద్ది, పత్రికలోఁ బ్రకటింపవలయునని నేను నిశ్చయించుకొంటిని. సతీశుఁ డామెవిషయమున నాతో నెన్నియోమాటలు చెప్పఁదలఁచియుండెను—కాని, చెప్పలేదు—ఆప్రణయమూర్తుల సుఖసంతోషములను జూచి, నామనసు తనయావనమును జ్ఞప్తికిఁదెచ్చుకొనియెను.

సతీశుఁడు "ఇఁక నేనుబోయెదను." అనియెను.

నేను "కాలినడకనా—మనోవేగముననా?"

"ఆమాటలకేమిలే. నేనుపోవుచున్నాను. నీబసయ్యు

నుకూలముగనున్నదియో లేదో చూచుటకువచ్చితిని, ”

“ ఇప్పుడైన నేనొకఁడ నిక్కడనుంటినని నీకు జ్ఞప్తి కివచ్చినదే ! ”

“ చాలులెమ్మ ! —నిన్ననాలుగుగంటలకుఁజూచెదను—వచ్చెదవుకాదా ? ”

“ నాలుగుగంటలకా ? రాను—నేనురాను—నన్నెవ్వరునుబిలువలేదు. ”

“ ఏమి ? పిలువలేదా ? — సేనుగారిభార్య చెప్పినదేమి ? ”

“ వచ్చినచో ”— ఇదేమియాహ్వానము ”

“ అదియేయాహ్వానము ”

“ ఆలాగా ? ”

“ కాకేమి ? — వాద్యఘోషములతో నీయింటికి వచ్చి శాస్త్రోక్తముగా, అక్షతలు బొట్టుపెట్టి—రేపు—గంటలకు—దయచేయుఁడు ” అని యాహ్వానము చేయవలయునా ? ”

“ వాద్యఘోషములు, అక్షతలు, బొట్టు—ఇవన్నియు నాకెందులకు ? నేఁడు చాలఁబనియుండుటచేఁ రాఁజాలనంటిని—కాని, యదినాగరికతయని వారు భావించుచున్నారు కాఁబోలును ! అయ్యో ! నేను నల్లవాఁడను. మీ తెల్లమ

ర్యాదలు నాకుఁ దెలియవు—కొంచెము చెప్పుము"

"నిజముగా నదియనాదరణమనియె భావించితివా?"

చిక్కు-నఁబడితిని. సేనుగారిభార్య యామాటలను జెప్పుచున్నప్పుడు "పనియున్నది—నేను రాఁజాలను" అని విస్పష్టముగఁ జెప్పక, ఆహ్వానవాక్యమునందలి చోకారమునుగూర్చి యాలోచించుట యెట్టిమూఢత !" అని నన్ను నేనే తిట్టుకొనుచుండఁగా—"అంతగా యోచింపనక్కఱలేదు. నీవింకనొకసారి వచ్చినప్పుడు "దయయుంచి క్షమింపుఁడు" అని వారు చెప్పినఁజాలునా—కాని, నీవెందులకు రావు?" అని యాతఁడడిగెను. నిజమైన కారణమును జెప్పకయే నేను "పనియున్నది" అని చెప్పితిని.

"నీకెప్పుడును బనియే— ఇట్టిపాత్రయలవాటులను నేఁటికొక్కనాఁటికిఁ గట్టిపెట్టఁగూడదా?"

"అట్లుచేయఁజాలను."

"అట్లయినచో నేనొక్కమాట చెప్పెద నాలకింపుము—వచ్చుటయత్యుత్తము—వచ్చుటకై ప్రయత్నించుట మధ్యమము—రాకుండనుండుట యధమము—"

అని సతీశుఁడు వెడలిపోయెను. పాపము ! ఏమియాతొందర ?

ఏమైననేమి? నేనెట్లును "దయయుంచి క్షమింపుఁ"

డని చెప్పి వారిమర్యాదపద్ధతులనతిక్రమింపవలయునని యను
కొంటిని.

ఇంతలో నాకొక యుత్సాహము కలిగెను. బం
గాళాజ్యోతియందు ప్రకటింపఁబడిన "స్త్రీజీవన" ము
నువ్యాసమువిషయమున మోహినియభిప్రాయమును దె
లిసికొనవలయునను కౌతూహలమును గలిగెను. అది మో
హినివంటి స్త్రీలయుపయోగమునకే గదా వ్రాసియుంటిని!
మోహినియభిప్రాయము నెంతవఱకావ్యాసముమార్పు చేసి
నదో తెలిసికొనవలయునను నాత్రముతో మనసులో నిష్ట
ములేకపోయినను, నేను బయలుదేరవలసినవాఁడనైతిని!
అయ్యో! చోకారము—నామర్యాద—ఇవన్నియు నెక్క
డకుఁబోయినవి? ఇంచుక యోచించినాఁడుఁడను!

నేను వచ్చుసరికెవ్వరును గృహమున లేరు. కాని,
మోహిని స్వల్పకాలములో నేమోకాని నేనున్నగదిలోనికి
వచ్చి "మీదర్శనమువలన నాకుఁ జాలసంతోషముగా ను
న్నది. మీరు రారని మేమందఱమును హతాశులమై యుం
టిమి. నాతలిదండ్రులును, సతీశుఁడును బూవుదోఁటకుఁ
బోయియున్నారు. సతీశబాబు మీరు రారని చెప్పియున్నాఁ
డు. చాలఁబనియున్నదికాఁబోలును!—ఏదోయొకక్రొత్త
వ్యాసమును వ్రాయుచుంటిరేమో?" అనియెను.

"ఔను — నాకుఁ బనియున్నదనియే భావించుచున్నాఁడను."

"దినమున కెంత కాలము పత్త్రికాసంబంధమైన కార్యములకుపయోగించెదరు ?"

"ప్రాయశః నా సమయమంతయు దానిక్రిందనే వినియోగింపఁబడును. నా జీవనమునే దానికి ధారవోసియున్నాఁడను."

"నేను సత్యే — ఆపనియందే — రేయుంబవలు గడపవలయునని తలంచుచున్నాను. కాని, యాసంగతి మీయెదుటఁ జెప్పుట తప్పుకాదా ?"

"ఏమి ?"

"గృహమే సతికి యోగ్యమైనస్థలము. ఎవ్వతె సంసారరాజ్యకర్తవ్యమున మగ్నయై యందున్నవారిసుఖములను హెచ్చింపఁగలదో, ఆమెయే నిజముగ సతీమణి !" అని మీరే వ్రాసితిరిగాదా ?"

"ఐన నా వ్యాసమును జదివితివా ? —"

"చదివియుంటిని. ఆపత్త్రికయంతయును జదివివైచితిని. నిన్నరాత్రి శయ్యమీఁదఁ బరుండి దానినిచదువుచుండఁగా నాకునిద్రపట్టిపోయినది — లేచిచూచుసరికి మైనపువత్తి కాలిపోయి యడుగున మండుచుండెను. నేనదరిపడిచూ

చి "అయ్యో!" అని కేకవైచితిని.

"భగవదనుగ్రహము! ఏదియు నంటుకొనలేదుగదా!"

"నేను చదువుచుండి యేమఱచియున్నప్పుడు దీపము తెరయంటుకొని నన్ను భస్మముచేసి వైచినచో — అవివాహమైయున్న యేకవర్తమానపత్రికలయందుం బ్రకటింపంబడం దగిన వార్తావిశేషములు బయలువెడలవచ్చియుండును. మీ పత్రికకవి యనుకూలించియుండును."

మొదటనాకందులకుఁ బ్రత్యుత్తరమే దొరకలేదు. నేను, అర్థములేని నవ్వునవ్వుచు "నీకు భాషాభిమానమింత గానున్నచో, నీవే యెందులకు వ్రాయరాదు ?" అంటిని.

"నేను వ్రాయునా ? — దానిని చదువువారెవ్వరు ? కాక, యచ్చువేయించువారెవ్వరు ?"

మోహిని రహస్యముగ వ్రాయుచున్నదని నాకు సంశయము కలిగినది. కాని, నేను బహిరంగముగ నడుగఁ జాలకపోయితిని. క్రమముగా మేము చిన్నకథల విషయమునఁ జర్చింపనారంభించితిమి. మోహిని — "చిన్నకథలను వ్రాయఁగలనా స్నేహితుండొకఁడు నాకొక లేఖనము బంపియున్నాఁడు. చూపింతునా ? —" అనియెను.

ఈవిధముగా నన్నామె యుపకర్త్రిగాఁ జేసికొనఁజేయునని తెలిసియున్నచో నేనెప్పటికిని చిన్నకథలనుగూర్చి

న ప్రస్తావమునే యెత్తకుండ నుండియుందును. ఈనాసంపా
దకీయకర్తవ్యములయందు, తలనొప్పియెత్తింపని హృదయశై
లిగలకథలను జదివిచూచుటయు, నొకభాగ్యవిశేషమే—నే
నెన్నియోకథలనుజదివి తలనొప్పిచే బాధపడుచుంటిని—
ఇప్పుడు నేనొకనెలదినములు సెలవుమీఁద వచ్చియుంటిని.
రామేశ్వరమునకుఁబోయినను శనీశ్వరుఁడు విడువలేదన్నట్ల
య్యెను. ఉపాయాంతరమునుగానక "కానిమ్ము—తీసికొనిర
మ్ము!" అని చెప్పితిని.

"చూచుటమాత్రమేకాదు— మీయభిప్రాయము
నుగూడ నీయవలయును."

"అట్లనుగానిమ్ము!"

"ఆతఁడు నాస్నేహితుఁడని యేమియును మఱుఁగు
పఱుపరాదు."

"అంతటియాత్రమున్నచో, నాయభిప్రాయమునే
చెప్పివైచెదను."

మోహిని లోపలకుఁబోయి వ్రాతప్రతి నొకదానిని
దీసికొనివచ్చెను. మేలికాగితముపై రూలువైచి యర్థభాగ
మునువిడిచి, యొక్కప్రక్కనే మనోహరముగా వ్రాయఁ
బడిన యాప్రతినిజూచి, "ఎవ్వరో కొత్తలేఖకులు!" అంటిని.

"ఔను. మీకెట్లు తెలిసినది?"

"నూతనలేఖకులు సామాన్యముగా వ్రాతప్రతులను విశేషశ్రద్ధతో సిద్ధము చేసెదరు. పేరుప్రఖ్యాతిగల లేఖకుల వ్రాఁత కొన్నిసందర్భముల బ్రహ్మలిపికంటెను గహనముగా నుండును."

ఇట్లు చెప్పి నేను తుదిపత్రమును ద్రిప్పిచూచితిని. అచ్చట సాధారణముగా నుండునట్లే లేఖకుని పేరు వ్రాయఁబడియుండ లేదు. నాయికానాయకు లిరువురును విషపానము చేసినందరేమో చూడవలయునని ప్రతిపుటయును వెదకుచు వచ్చితిని. ఇప్పటి లేఖకులలోఁ జాలమంది తమనాయికానాయకులను జీవములతో విడిచిపెట్టుట లేదు— ఇప్పటికథలయందలి ముఖ్యపాత్రములెట్లును మరణింపకుండ నుండుట లేదు. కాని, దీనిలోని నాయికానాయకులు సజీవులై యుండుటను జూచుటచే నాకించుక యాశ కలిగెను. అప్పుడు నేను "మోహినియే యెందులకు దీనిని వ్రాయఁగూడదు?" అని యనుమానించితిని. అనేకనూతనలేఖకులు తమప్రథమప్రయత్నమునఁ బేరు ప్రకటించుకొనుటకై జడియుచుందురు. అది తమస్నేహితులదని యసత్యములు చెప్పెదరు.

"దీనిని దీసికొనిపోయి రేపు నాయభిప్రాయమును జెప్పెదను."—అని చెప్పితిని.

మోహినియే దీనిని వ్రాసినదని నిస్సందేహముగాఁ

జెప్పవచ్చును — ఇంక — ఏవిధముగా నాయభిప్రాయమును యవలంబనమునది నేనప్పుడే నిశ్చయించినైచితిని. నాజీవిత కాలమునందప్పుడును నామిత్రుల పుస్తకములవిషయమున " సొగసైనకథ ! నవరసభరితము ! సహజసైరి ! శోకము; హాసము, క్రోధము, — దర్పు, జ్వరము — ఏకకాలమునం గలుగును ! స్వల్పప్రతులుమాత్రమేయున్నవి — ఆలసించిన నవియును దొరకంబోవు ! — పెంసులభము ! మంచి ముద్రణము ! తెల్లనికాగితములు ! వేగముగా జాబులు వ్రాసికొనుండు ! " — అనివ్రాయుచున్నప్పుడు — పాపము ! — స్త్రీ — ఈమెవిషయమున నేమివ్రాయవలయునో — ఏమివ్రాయుదునో — పాఠకులేయూహింపవలెను ?

అంతలో వెలుపలకుంబోయిన వారందఱును లోపలికి వచ్చిరి. తేనీరుకొనీటినిదాగితిమి. అనేకవిషయములనుగూర్చినమాటలైనవి. నేను బయలుదేరితిని — నాఁడువ్రాయు సేవనమునకుం బోవునిచ్ఛయే లేకపోయెను.

ఇంతటికిం బోయి కథనుజదివి నేను మహాగాథమునం బడితినని భావించుకొంటిని. అదిప్రథమప్రయత్నముకాదు. అనుభవశాలినలననే యది వ్రాయంబడినట్లుండెను. కథ చమత్కారముగ మనోహరముగ వ్రాయంబడియుండెను. మఱియు నది మోహినిలేఖనముకాదని యప్పుడు నాకుఁ

తెలియవచ్చెను. నేనంతవఱకును చేతియందు ధరించియున్నది
సంపాదకుని లేఖినిగాని గడ్డికోయు కొడవలికాదు — ఆ కథను
వ్రాసినవాని పేరును నేను నిమిషములో గ్రహించివైచితిని.
ఆతని పేరు గోపీకాంతరాయలు — నేనాతని నెప్పుడును జూచి
యుండలేదు, కాని, డాక్టరు మీరాపురమునందు ఎక్కడనో యాతఁ
డు నివసించుచున్నాఁడని మాత్రము చెప్పఁగలను. ఆతఁడు
చాలఁ బుస్తకములను జదివియుండెను. అభివృద్ధికి రాఁదగిన
పురుషులలో నాతఁడే యుత్కృష్ట లేఖకుఁడై యుండెను.
అయినను నాతని వ్రాఁతలలోఁ దప్పులు లేకుండ నుండలేదు.
అది బహుశః ఆతని యౌవనదోషమై యుండవచ్చును. కాని,
వానిని దిద్దుకొనుటకు విశేషప్రయత్నమక్కఱలేదు.

మఱునాఁడు మోహిని యెదుటనే నా లేఖనమునం
దలి తప్పుల నేరిమాపి యామె స్తోత్రమునకుఁ బాత్రభూ
తుఁడనైతిని. "లేఖకుఁడు యువకుఁడా?" అని యడిగితిని.

"అవును. నాకంటెఁ గొంచెము పెద్దవాఁడు"

"నీకుఁ బ్రాణస్నేహితుఁడై యుండవలయునని భా
వించుచున్నాఁడను"

"అవును"

ఆ ప్రత్యుత్తరము నాకు రుచింపలేదు. ఈమెయో —
ప్రాయమువచ్చిన చిన్నది — ఆతఁడో — వయసువచ్చినవాఁ

డు — ఇది యేమి ? పిరియపుర కింతటి మైత్రియేమి ? —" అని యోచించుకొనుచు — " ఇంకను నీయొద్ద లేఖనములేవైనను న్నవా — ? " అని యడిగితిని.

" ఉన్నవి — ఆతఁడు వ్రాసినప్పుడెల్ల నాయొద్దకే పంపుచుండును. నిన్న నొకదానిని బంపియున్నాఁడు "

" ఇదేమో బాగుగ లేదు — ఇరువురును — పరస్పరమిత్రులు ! — ఇది కేవలమును బాగుగ లేదు —" అనినాలోనేనను కొనుచుఁ బ్రకాశముగా " అట్లయినచో నీవే యాతనివాచకులలో ముఖ్యమైనదానవు " అంటిని.

" అవును — ప్రథమవాచకురాలను నేనే. నాకాతనియందుండెడి పూజ్యభావము మఱెవ్వరియందును లేదు. "

" ఆతని పేరు నడుగవచ్చునా ? "

ఆమె యించుక యోచించి " గౌరీకాంతరాయలు " అనియెను. చెప్పుచుండఁగనే యామెముఖము వికసించెను.

" సతీశుఁడు చెడినాఁడు ! ఈచిన్నది యాతని మార్గమధ్యముననే విడిచివేయుట నిజము ! " అని నాలోనేనను కొంటిని —

---

(౬)

ఇంతవఱకును సతీశుఁడు మోహినిపాణిగ్రహణవి
షయమున నామెతండ్రియంగీకారమును బొందియుండ
లేదు. సతీశుఁ డాప్రస్తావమునెత్తినచో — వారిరువురు సం
దులకంగీకరించుట కెట్టిసందేహమును లేదు. డాక్టరుసేను సతీ
శుని నల్లునిగాఁ జేసికొనుట కెంతో త్వరపడుచుండెనో, స
తీశుఁడాతని " మామ " యని పిలుచుటకంతటియాతురము
నందుచుండెను. ఇది నాకనుభవైకవేద్యమే — ఇందులకు
నేనే సాక్షిని — సతీశునిగృహమునందేయుంచుకొని, నన్ను
పాత్రము తేయాకునీటిచేఁ దృప్తినొందించుటచూడఁగా—
పాఠకులారా! మీరైన నేమనిభావింతురు? " అల్లుఁడునె
త్తిమీఁదిదేవత!" — అని భావింపరా? — కాని, నాకొకాంత
రాయ మీనడుమనడ్డమువచ్చి నిలిచెనే! — ఇది నాకు విశేష
విషాదమునుగలిగించుచుండెను. మోహినియాతని సే పూ
జించుచున్నదనుసంగతి నాకు బాగుగఁ దెలియును. కాని, నా
రియందింతటి ప్రేమమైత్రులు నాకెట్టులకుండవలయునో —
నేనుచెప్పఁజాలను. నా మనస్సున కీర్ష్యాపార మీవిధముగాఁ
దోఁచుచున్నది — మోహిని సతీశుని బెండ్లియాడును. మోహి
నిబంగాళాభాషయందువిశేషాదరముకలది. సతీశుఁడో — దా
నిపేరుచెప్పినచో నుగ్రకోపమునుదాల్చుచుండును — ఆ

తనికిని భాషకును సగమెఱుక — అనుపమ గౌరీకాంతరాయలు — అత్యుత్తమ లేఖకుఁడు — మోహినిని దనగృహిణిగా నేరికోరియున్నాఁడు. మోహినియు నాతనినే మోహించి యాతనియం దాసక్తయై యున్నది — ఇది గుర్తింపరాని బీజముగా నున్నది — ఇందువలన నెట్టి వృక్షము పైకి లేచునో — ఎట్టి ఫలము కలుగునో — యెవ్వరు చెప్పఁగలరు ?

మోహిని — ఇఁకనొక్కనికి — మెడలో హారమును వైచునా ? — ఇది సాధ్యమా ? — కాదు. నాముక్కునన్నాపిరున్నంతవఱకు నది సాధ్యము కాదు — నేను నామిత్రునిమార్గమును పరిష్కరించుటకు సమర్థుఁడనై యుంటిని — కంటకితమగు నాతని దాంపత్యజీవనమును, సుఖమయముగాఁ జేయుటకు శక్తిమంతుఁడనై యుంటిని. ఎవ్వనిని మోహిని తనమనోవాక్కాయములఁ బూజించుచున్నదో, యెట్టివానికై కట్టఁబడియున్న యూదేవమందిరమును, విమర్శనాస్థాపకమగు పిడుగులను గురియించి ధ్వంసము సేయకున్నచో — నేను పత్రికాసంపాదకుఁడను పేరున కర్హుఁడనగుదునా ? నూతనలేఖకులలో గౌరీకాంతునికంటె నత్యుత్తమలేఖకు లెందఱో కలరని మోహినికి దృష్టాంతపూర్వకముగఁ జూపించెదను. భాషయందును, వ్యాకరణమునందును, గలతప్పులను వెదకి పైఁబెట్టెదను — పాశ్చాత్యుల ప్రాచీననవీనసాహిత్యములను

బరిశోధించి నేనుగూడ నా గౌరీకాంతరాయని యభిప్రాయ
ములట్లే యుండులాగున లేఖనములను వ్రాసెదను. అనేఁ
కేమూలగ్రంథముల నాధారముచేసికొని వ్రాయుచుం
డెనో యామూలగ్రంథముల నాధారముగఁ గైకొని నేను
వ్రాసి గౌరీకాంతరాయులు ప్రపంచమునం దెంతటివాఁడో యఁ
తైనదియు నుద్ఘోషించెదను — ప్రకటించి వైచెదను — పలు
విధముగా నెఱతెగని వ్రాఁతలచే మోహినిమనస్సునందలి
భ్రాంతిని దొలఁగించి యామె యాపేక్షా స్వరూపుఁడు గఁ
డ్డిచేఁ బూరింపఁబడిన తోలుబొమ్మయని — నిశ్చయ
ముగ — నిదర్శనపూర్వకముగ — నిమిషములో బయలుప
ఱచెదను — నేను బంగారుజ్యోతికై సర్వమును త్యాగించి
వైచితిని. నా విమర్శనాయుధము — చిన్నపెద్దతనములతోఁ
బనిలేకుండ — అందఱిలేఖకులకును యమస్వరూపముగఁ
దాండవమాడుచున్నది. ఇప్పుడా యమదండముచే, ఆగౌ
రీకాంతునిఁగూర్చి, నాస్నేహితు నుద్ధరించితీరెదను. కాని,
యొక యనుమానము మాత్రమున్నది. ఇట్లుచేయుట — పత్రి
కాసంపాదకునికర్తవ్యమునకు విరోధముకాదా? ఇప్పుడు —
నేను స్థిరప్రతిజ్ఞాబద్ధుఁడనై యుండుటచేఁ గర్తవ్యసాధనమును
నా మనస్సాక్షిని దూరముగా — లోకములకు — ద్రోసిపా
ఱవైచితిని.

విమర్శనమునకని గౌరీకాంతునిచేఁ బంపఁబడిన యా “నందరాణి” ని బైకిఁదీసి తీక్ష్ణమగు నొకక్రూరవిమర్శనమును వ్రాసి కలకత్తా కార్యాలయమునకుఁ బంపితిని. స్వల్పకాలములోనే యది యచ్చుకూర్పఁబడి దాని మొదటిప్రతి దిద్దుటకై నాయొద్దకు వచ్చెను. దానిలో మరలఁ గొన్ని తావుల విమర్శనకార్యమును మఱింత హెచ్చించితిని.

నాఁటి మధ్యాహ్నము సతీశుఁడు నాయొద్దకు వచ్చెను. ఆతఁడు బల్లపైనున్న నందరాణిని దీసికొనియెను. నేనాత్రముతో “ పోయి ప్రాయశ్చిత్తము చేసికొనుము ! నీవిప్పుడీ బంగాళాపుస్తకమును ముట్టుకొంటివి—” అని చెప్పితిని.

“ పాడుపుస్తకమును బట్టుకొని ప్రాకులాడుచున్నావు ? ఒకవారమైపోయినది— ఇంకను నీవొద్దునకుఁ జేరకుండ నున్నావు. ఎప్పుడు వచ్చినను, ఈపుస్తకముతోడనే కాలక్షేపము చేయుచుంటివి ! నేఁడు దీని నిక్కడనుండి పట్టుకొనిపోయి తీరుదును.”

“ దానిమీఁద విమర్శనము వ్రాయుచుంటిని. అది యిప్పటికి ముగిసినది—ఇఁక నీవుతీసికొనిపోయినను బాధకమేమియును లేదు.”

“ విమర్శనము ముగిసినదా? ”

“ అవును. మొదటిప్రతిని దిద్ది నేఁడే పంపినాఁడను.”

"సతీశుఁడు దేశభాష పేరు చెప్పినంతనే చెవులు మూసికొని మూఁడు మైళ్లదూరము పరుగెత్తుకొనిపోవునాఁడు. అట్టియాతఁ డిట్లయినాఁడేమి ?" అని యాలోచించుచుండఁగా నాతఁడు నాముఖమునుజూచి గట్టిగా నవ్వెను.

"ఏమి ? ఎందులకునవ్వెదవు ?"

"ఒక చిన్నరహస్యమును జెప్పవలయునని యనుకొనుచుంటిని. నీవిమర్శనము పైకిరానిమ్ము."

నేనాశ్చర్యముతో "నందరాణి విమర్శనమా !— నీకు దానితో నేమిసంబంధము ?" అనియడిగితిని.

"ఉన్నది— సమీపసంబంధమేయున్నది. తండ్రికిని కొడుకునకునున్న సంబంధము! తల్లికిబిడ్డకునున్న సంబంధము! భార్యకునుభర్తకునున్న సంబంధము ! ఉప్పునకునూరుగాయకునున్నసంబంధము ! చంద్రునకునుసముద్రమునకునున్న సంబంధము ! నస్యమునకును సున్నమునకునున్న సంబంధము ! బొబ్బట్టునకు నేతికినున్న సంబంధము ! బ్రాహ్మణునకును దక్షిణకునున్న సంబంధము ! విటునకును త్రాగుబోతునకునున్న సంబంధము ! వంకాయకును కారమునకునున్న సంబంధము ! పనసకాయకును, ఆవకునున్న సంబంధము? దోసపెరుగునకును తైలమునకునున్న సంబంధము ! చింతకును బులుసునకునున్నసంబంధము ! గౌరీకాంతునకును—సతీశునకుఁగలసంబం

ధము !- తెలిసినదా ?

"అనఁగా ?"

"అనఁగా ననఁగా నేమి ?—కథ చెప్పుటయా?—ఒక్క మాటలోఁ జెప్పవలసివచ్చినచో నేనే నీగౌరీకాంతుఁడను!"

నేనాకాశమునుండి పాతాళమునకుఁ బడిపోయితిని.

"నీవా ?"

"నేనే—రెండుకన్నులున్న మనుష్యుఁడను—అవును—నేనే మానసతీశుఁడను—ఆగౌరీకాంతుఁడను నేనే—నమ్మికలేదా ? నాకును దేశభాషకును గలసంబంధము, నా శాయణభాష్యమునకును ఈసామ్రాచార్యులకును గలసంబంధము వంటిదనుకొనుచున్నావా ?"

"అట్లుకాదు—ఇట్లునుగాదు—ఎట్లు చెప్పుటకును నా బుద్ధికేమియును దోఁచుట లేదు."

"ఇన్ని సంస్కృతపుస్తకములను జదివియు నేమిప్రయోజనము ! సతియనఁగా=గౌరి ; ఈశుఁడనఁగా=కాంతుఁడు;—ఈమాత్రము తెలిసికొనలేకపోయితివిగదా! ఈసమస్య నీవంటిపండితుఁడే పూరింపలేనిచో—ఇఁకనెందులకీపాండిత్యము !—ఈపత్రికాధిపతిత్వమింకెందులకు ?"

"నీవా !!!" అని చెప్పుచు నేను సేవకునిబిలిచి "చెలిగాత్రపుఘాతము" ను దీసికొనిరమ్మని చెప్పితిని. ఇంగ్లాండు

నందున్నప్పుడు, ఆంగ్లేయవస్తుప్రదర్శనశాలయం దనేకవంగ
భాషాపుస్తకములను జదువుచుంటిననియుఁ బిమ్మట స్వతంత్ర
ముగ నుపన్యాసములను వ్రాయఁదొడఁగితిననియు, సతీశుఁ
డు నాతోఁ జెప్పెను. నందరాణి యాతనిచేతనే వ్రాయఁబ
డినదని మొదటనే తెలిసినచో నాకీకష్టమెందులకు?—ఈ
హృదయాందోళనమెందులకు?—ఈకార్శ్యమెందులకు?—
సతీశుఁడును గౌరీకాంతుఁడు నొక్కఁడేయని, నాకు మొదటనే
తెలిసియున్నచో, నేనొకవారమువఱకును నిద్రాహారముల
నువిడిచి చేసినయీకార్యము— ఈశ్రమ— నాకు మిగిలి
యుండును—కాని, యిప్పుడేమిచేయఁగలము?— జరగిపో
యినది జరగిపోయినది!

సేవకుఁడు ఫారమును దెచ్చినపిమ్మట "నేఁడు నేను
విమర్శనపత్రినిబంపియుంటిని. దానిని బ్రకటింపవలదు—
దానికి బదులుగ మఱియొకవ్యాసమును బ్రకటిం
వలయును—" అనివ్రాసి నాకార్యదర్శికి తంతిమూలకమై
వర్తమానమంపితిని.

# అనుబంధగ్రంథములు.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1. రాధారాణి. | 0 | 4 | 0 | 0 | 4 | 0 |
| 2. యుగళాంగుళీయకము. | 0 | 3 | 0 | 0 | 3 | 0 |
| 3. రాజభక్తి. | 0 | 2 | 0 | 0 | 3 | 0 |
| 4. లీల. | 0 | 3 | 0 | 0 | 4 | 0 |
| 5. సాధన. | 0 | 5 | 0 | 0 | 7 | 0 |
| 6. ఇందిర. | 0 | 3 | 0 | 0 | 4 | 0 |
| 7. ప్రభావతి. | 0 | 2 | 0 | 0 | 3 | 0 |
| 8. మాలతి. | 0 | 1 | 6 | 0 | 2 | 0 |
| 9. కమలాకాంతుఁడు. | 0 | 1 | 6 | 0 | 2 | 0 |
| 10. * పరిమళ. | 0 | 6 | 0 | 0 | 8 | 0 |
| 11. రజని. | 0 | 6 | 0 | 0 | 8 | 0 |
| 12. * నీరద. | 0 | 5 | 0 | 0 | 7 | 0 |
| 13. సీతావనవాసము. | 0 | 5 | 0 | 0 | 7 | 0 |
| 14. ఉన్మాదిని. | 0 | 3 | 0 | 0 | 4 | 0 |
| 15. సంతాపకుఁడు. | 0 | 4 | 0 | 0 | 5 | 0 |
| 16. ఆరణ్యక. | 0 | 6 | 0 | 0 | 8 | 0 |
| 16. వియోగిని. | 0 | 3 | 0 | 0 | 4 | 0 |
| 17. కృష్ణకాంతునిమరణశాసనము. | 0 | 6 | 0 | 0 | 8 | 0 |
| 18. చంద్రసేనుఁడు | 0 | 4 | 0 | 0 | 5 | 0 |
| 19. వ్యాఘ్రాచార్యబృహల్లాంగూలము. | 0 | 2 | 0 | 0 | 2 | 0 |
| 20. ఉన్మత్త | 0 | 2 | 0 | 0 | 2 | 6 |
| 21. మీరాబాయి. | 0 | 1 | 0 | 0 | 1 | 6 |
| 22. రాణీతారాబాయి. | 0 | 1 | 0 | 0 | 1 | 0 |
| 23. కాబూలుసాహేబు. | 0 | 1 | 0 | 0 | 1 | 0 |
| 24. భారతమహిళ. | 0 | 5 | 0 | 0 | 7 | 0 |
| 25. భారతీయులయుపనివేశములు. | 0 | 2 | 0 | 0 | 2 | 6 |
| 26. హారావళి. (ప్రథమభాగము.) | 0 | 3 | 0 | 0 | 4 | 0 |
| 27. హారావళి. (రెండవభాగము) | 0 | 3 | 0 | 0 | 4 | 0 |

ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము.
అనుబంధగ్రంథమాల. 39.

# బ్యారిష్టరు.

ఇది

కర్ణాటకగ్రంథమునుండి

బాలాంత్రపు వేంకటరావుగారిచే

ఆంధ్రీకరింపఁబడినది.

అయ్యగారి నారాయణమూర్తి బి. ఏ. బి యల్ గారిచే

సంపాదింపఁబడినది.

రెండవకూర్పు.

నిడదవోలు

ఆంధ్రప్రచారిణీముద్రాక్షరశాలలో

ముద్రింపఁబడినది.

1916.

వెల రు 0—1—0.

శ్రీరామచంద్రి.

# బ్యారిష్టరు.

---

ఏదినమున దుస్తరమగుసాగరమునుదాటి దూరమునం దున్న ఇంగ్లాండునకుఁబోవుటకై బయలుదేరితినో ఆదినము జ్ఞప్తికివచ్చుచున్నది! ఆయకూలార్ణవవక్షంబునందు, అభయంకరమగుతరంగమాలికలయందు నృత్యక్రీడలనెరపుచున్న యానౌకాపతంగమునం దల్పారోహినైననేను కన్నులుతెరచుకొని, కేవలమాయంధకారమునుజూచుచు భయవిహ్వాలచిత్తుఁడనై యెప్పుడువడంకనారంభించితినో, తిరుగాడుటకవకాశములేక, వ్యాకులచిత్తయగుకొత్తకోడవలివలెనెప్పుడువికలచిత్తుఁడనైతినో, ఎప్పుడు మరలగృహమునకువచ్చుట కుపాయముదొరకక శయ్యపైఁబడి పొరలాడఁదొడఁగితినో, అప్పటియాస్థితిగతులన్నియు నాకిప్పుడు జ్ఞప్తికివచ్చుచున్నవి! అంతయు నప్పటివృత్తాంతము!—నేనింగ్లాండునకు బయలుదేరితిని. పైతృకసంబంధమైనయాస్తినిగుదువఁబెట్టియప్పుఁదీసికొని తల్లికూడఁబెట్టినధనమును రహస్యముగా కైవసముచేసికొని—భార్యనగలనన్నిటిని కౌశలమునలాగికొని—దొరికినంత ధనమునుసంపాదించుకొని—సంసారమమత్వమునుండిముక్తుఁడనై

న నేను—ఇంగ్లాండునకు బయలుదేరితిని—ద్వాపరయుగమునందు వేణునాదమునకు ముగ్ధములైన ధేనువులు యమునాస్రవంతిని దాటి శ్రీకృష్ణునిజూచునాశతో మధురానగరమునకు బయలుదేరినవి! త్రేతాయుగమునందు భక్తిచే ముగ్ధుఁడైన వాయునందనుఁడు సీతనుద్ధరింపవలెనను నాశతో సముద్రమునుదాటి లంకకుబయలుదేరెను. కలియుగమునం దేడుసముద్రములను, పదునేను నదులనుదాటిపోయి బ్యారిష్టరుపరీక్షయందుత్తీర్ణుఁడనగుటకు ముగ్ధుఁడనైన నేను—ఇంగ్లాండునకు బయలుదేరితిని.

బ్యారిష్టరీ!—ఇది చిరకాలమునుండి నా హృదయమునఁ వెలుఁగుచున్నయాశ—శైశవమునందు నాకాత్మీయుఁడగు నొక వకీలుతో నప్పుడప్పుడు హైకోర్టునకుఁబోయి, అక్కడ బ్యారిష్టరునకున్న గౌరవమర్యాదలు, అర్థలాభము మొదలగు వానినిజూచి విస్మితుఁడనగుచుంటిని. బెనర్జీ, ముఖర్జీ, పాలిత ఘోషు, వసువు, సింహా, చౌధురి, మొదలగువారు బంగాళీలై యుండి బ్యారిష్టరులై పేరుమోయుచున్నప్పుడు మద్రిఁడనైన నేను వరుండియుండుట యెందులకు? అనియీవిధముగా భావించుకొనుచుంటిని. నేను, "బ్యారిష్టరి, బ్యారిష్టరి, అనువిచారముతక్క మఱియొక చింతయే లేకుండనుంటిని.

అదిమొదలుకొని, కలకత్తా విశ్వవిద్యాలయసంపర్క

మును స్వజనులసంపర్కమును దూరముగఁ ద్రోయుచు నింగ్లీ
షువారిచర్యల నభ్యసింపనారంభించితిని.

ప్రతిభ నెవ్వ రడ్డగింపఁజాలుదురు? మొసలిపిల్లశిక్షణ
ము లేకుండఁగనే యీఁదుటను నేర్చుకొనును—వానరశాబక
ము జనియించినతోడనే వృక్షశాఖావలంబనమున కలవాటు
పడును. అట్లే నేనును—ఏకలవ్యునివలె నుపదేశము లేకుండఁ
గనే దొరలరీతి, నీతి, హావము, భావము, మొదలగుచర్యల
యందు విశేషముగఁ బారదర్శిత్వము నొందినవాఁడనైతిని. ఆ
ట్లగుటనుజూచి స్వయముగ దొరగారే విస్మితులై యాశ్చర్య
ప్రథమావేగమడంగినపిమ్మట, నాత్మసంవరణము చేసికొని,
“రాధామాధవులు నఖశిఖపర్యంత మొక్కమారే దొరగా
రైనారు! బూటు, హ్యాటు, కోటు, మొదలగున న్నిటితోడను
అచ్చముగ దొరగారైపోయినారే!” అని చెప్పెను—పిమ్మ
ట నాకంఠము నెత్తి వికృతముగా నాలుక మడతవైచుచు “ఆ
నందరామ!” యనుటకు మారుగ “ఆనోండోరోమ” అని యు
చ్చరించితిని. అప్పుడా దొర నన్నుఁజూచి “అంటురోగము బా
గుగ నంటుకొనినది. ఇఁక దీనికిఁ జికిత్స లేదు. ఇది నిలువెల్ల
వ్యాపించినది!” అని యనుకొనియెను—నాకు విచారము మి
తిమీరిపోయెను—అంతట సాగరకూలమును జేరితిని.

మూఁడువత్సరములైనపిమ్మట వెనుకకు మరలితిని—

వెనుదిరిగివచ్చినపిమ్మట నన్నొరులు గుర్తింతురనునాశయే నాకు లేకపోయెను—అట్టిది నాకిష్టమునులేకుండెను. కాని, నేనోడనుండిదిగుటకు ముందుగ నేనేనజ్ఞానావస్థలోనున్నప్పుడు నాబాల్యమున నాకు నెచ్చెలులుగనున్నవారుకొందఱు జయపతాకస్వరూపములగుఁదమవస్త్రపుటంచులు క్రిందికివ్రేలాడుచుండ నన్నెదుర్కొనుటకై యోడపైకెక్కివచ్చిరి. ఇంతలో నోడపైనున్న నానూతనస్నేహితులు వారియాకారవిశేషములు నాశ్చర్యముతోఁ జూడసాగిరి—నేను నాస్వజాతీయమిత్రులతోఁజేరి పరిధానాంచలములు వెనుకముందుల వ్రేలాడుచుండఁ దిరుగుటకిష్టములేనివాఁడనైతిని. కాని, విధాతృనిర్దిష్టము వేఱుగానుండెను. నాపూర్వస్నేహితులు నన్నుఁజూచి తమయానందమును బ్రకటించుట కుపక్రమించిరి. అందువలన నోడనుండి వేగముగా దిగిపోవుటతక్క మఱినాకుగత్యంతరము లేకపోయెను.

పిమ్మట నామేనత్తకుమారుఁడు " హోటలునకుఁబోవుచుయుంచుము. మొట్టమొదట నొకసారి మీయమ్మను జూచివత్తువుగానిరమ్ము" అనియెను. నేను మనస్సునందు "తల్లియొద్దఁజిక్కుపడియుండుట చిన్నప్పటినుండియు నున్నదియే. హోటలునకుఁబోయి యక్కడ మిత్రులయెదుట సేవకులచే నవమానమునుబొందుటకంటెఁ దల్లియొద్దకుఁబోవుటయే మం

చిది" అనియనుకొంటిని.

అకటా! నేనుపోవుతావును, గృహమని పిలువవలయు ను! ఇల్లనిపిలువవలయును! అదిహోము (Home) కాదుగదా! అక్కడ నుత్తప్తమగు (Warm affection) నాదరమునుపొందుసంభవములేదుకదా,—తల్లి నన్నుఁజూచి నవ్వి కన్నీరువిడుచుచు నస్థిరచిత్తయయ్యెను. మఱియు, గోడచాటునుండియుఁదలుపుచాటునుండియు, మాటిమాటికిఁ జలించుచున్నఛాయవలెఁ గనఁబడియుఁ గనబడకుండనున్నవ్యక్తి నేమనిపిలువవలయును?" సంసారము, కాక, కుటుంబము " అనిపిలువవచ్చును. ఇంటికోడలనిమైనను చెప్పవచ్చును. ఎట్లుకావలసిన నట్లనవచ్చును. కాని యామె సంగ్రహనామమై యున్నవైఫు (Wife) అనుశబ్దవాచ్యమునకర్హురాలగునా? ఆమె మిసెస్‌రుధర్ (రుదర్) అగునా? ఆమెలజ్జావతియగు నొకదాసియేయగునుగాని, " డియర్ లిజి! " (Dear Lizzi!) అగునా ?

పిమ్మట నేలపైఁబఱచినవిస్తరిముందర పీటమీఁదఁగూర్చుండి వామహస్తమునానుకొని దక్షిణకరముతోఁ జేయు ఘోరశబ్దసంయుతమగు విపరీతకార్యమునకు భోజనమనిగాని, ఖాదనమనిగాని, మఱియెట్లయినఁగాని పేరుంపవచ్చును. కాని దానిని " టేకింగ్ మీల్సు " (Taking meals) భోజనము చేయుట అనిపిలువవచ్చునా? దానిలోనొకబీఫ్‌ముక్క (Beef గో

మాంసము) అయినను గానరాదే!

కలకత్తాలో మొట్టమొదట ననుకూలమైనగృహము దొరకనికారణమున హోటలులో నుండవలసివచ్చెను. పిమ్మట పార్కుస్ట్రీటునందు (Park Street) ఒకగృహమును రెంటు (Rent—అద్దె) నకుఁ దీసికొంటిని. నేను కలకత్తాకువచ్చి హోటలులో వాసముచేయుట కారంభించినతోడనే యేదోయొక యోచనతో మాయమ్మ కాశీక్షేత్రమున వసించుటకై వెడలి పోయెను. ఇఁక మిగిలిన దేవ్వరు? మాహిందూమహిమచేఁ బాలింపఁబడుచున్న బాల్యవివాహసంబంధమైన పత్నీరూపకర్మఫలము నాపాలఁబడియెను. ఈకర్మము తల్లిదండ్రులచేఁ జేయఁబడినది. వారు దానినుండివిముక్తులైరి. వారికర్మఫలమిప్పుడు నాపైఁబడినది—నాదైనది. అదిజ్ఞానవృక్షఫలముకాదు. శైశవసంబంధమైనయజ్ఞానవృక్షఫలమగుటచే దానివలన నమంగళము సంభవించితీరునని. నిశ్చయించుకొంటిని.

కాని, నాపాలికివచ్చినయాఫలము నొకటిరెండువత్సరములు శిక్షాపూర్వకముగఁదిద్దుకొని యారంగభూమినుండి యవనిక నెత్తివైచితినను సుద్దిని వినుటకు మీరు సంతోషచిత్తులగుదురు—ఇప్పుడు నాభార్యమునుపటియాయజ్ఞానవృక్షఫలముగా నుండలేదు—మేలిముసుఁగునుదీసివైచి ఘోషాయను కారాగారమునుండి విముక్తయై షాపులకుఁబోవుటకును టెన్నీ

పాటనొడుటకును, సభ్యసమాజసంబంధమైనన మస్త నాట్యాభి నయములఁ జూపుటకును, సంసిద్ధురాలై వానిలో నెక్కుడునే ర్పరితనమును జూపనారంభించెను! మధ్యమధ్య నేత డబ్బులే క, ఋణము హెచ్చి కటకటఁబడుచున్నను, ఆవిచారమే మన స్సున పాత్రకుండఁబోయెను.

నాభార్య గొప్పగొప్ప కుట్టుపనివాండ్రయంగడుల కేఁ బోయి (Tailoring Shops) క్రొత్త క్రొత్తయుడుపులనుదీ సికొనివచ్చి ధరించి విజాతీయదంభముతో స్వసభ్యమండలి యందు సంచరింపనారంభించెను. ఆమెనాయుడుపులతోఁ జూ చినచో దేహ మొకవైపున ససంగతిమై స్థితమైయున్నదని యు, వేఱొకవైపున నిర్దయహృదయముతోఁ గట్టఁబడియు న్నదనియుఁ దోఁచుచుండుటయేగాక, ఆయుడుపొకవైపునఁ జాలకుండనున్నదనియు, ఒకవైపున నిరర్థకముగ బహుళీకృత మైయున్నదనియు, వేఱొకవైపున నపర్యాప్తమై భూలుంఠిత మగుచున్నదనియుఁగూడఁ గనఁబడుచుండెను. అమూల్యవ స్త్రములును, గుప్పనములును, తయారగుచున్నప్రదేశములగు వారణాశిమొదలగు నగరములామెపాలిటికి భూపటమునం డి (World map) యంతర్హితములైపోయినట్లుండెను. ఇది శీత కాలము—ఇది యెండకాలము, అను భేదములేకుండ నాభార్య వేశియుండు ఏనుఁగుదంతముఁ జెటి దొమునకతోఁ జేయఁబడిన

విసనకఱ్ఱలవిత గతి నిటునటునూఁగుచున్నప్పుడు, సూరి
ము నందున్నచంద్రికళవలెఁ బ్రకాశించుచున్న కాశ
ము లదృశ్యములై పోయినవి!—ఆమెకుడిచేతిమణిబ
నూతనసభ్యతకు రక్షాబంధస్వరూపముగ ప్రశస్తము
యతిబ్రాస్లెట్సు (Bracelets) ప్రకాశింపసాగెను.
యసంబంధమగు నాపూర్వసౌభాగ్యశ్రీ విలాసములక
తరించిపోయినవి! అప్పుడు నేనామెనుజూచి యింగ్లీషు
"ప్రియసీ! నిజముగా నీవిప్పుడు నాదానవు!" అని
నాప్రియపియు నదేభాషలో "రాధామాధవా! నా
దాని! నీవొకనిర్బోధహంసవు! (You are a stupid g
ని ప్రత్యుత్తరమునుజెప్పెను. ఇంగ్లీషునందు నిర్బో
ను, హంసకును, గూస్ (Goos) అనుపదమువర్తించు
తియేగాక ప్రేమాలాపములయందాపదము సంబోధ
ముగఁ బ్రియునకుఁగూడ వర్తించుచుండును. ఇఁక న
ము నేమనివర్ణింతును! నాభార్య ఆంగ్లేయభాషలో నిట్టి
ర్థములతో మాటాడునంతటివిద్వాంసు రాలయ్యెను!

నేనొకనాఁడు బార్లైబ్రరీ (Bar Library—
శ్లపుస్తకాలయము) లో నక్షత్రమండలియందలిధ్రూ
వువలెనే ప్రవేశించితిని—అక్కడ నాయానందమునకు
తియున్నదా! అప్పటి నాసుఖస్మృతి యిప్పటికిని నావ

ముఖం దంకితమైయున్నది. ఏగృహమునందు, ఉడ్రో
వాన్సు, జ్యాక్సన్, పాల్, బానర్జీ, పాలిత, ఘోషు
గు మహాగౌరవముగలలాయర్లు, ఇంద్రసభలోనిదేవ
విరాజిల్లుచుండిరో, అట్టిసభయందు నేను సభ్యుఁడనై కు
దఁగూర్చుంటిని. ఒకానొకదినమున నేనాసభకు సభాప
డనయ్యెదనేమో యెవ్వరుచెప్పఁగలరు? నామనస్సునం
శ యుండెడిదో, లేదో, యిప్పుడు నేను చెప్పఁజాలను
నాతోడిసభ్యుల కాయాశయుండెననిమాత్రము వ్యక్త
ది—ఏమందురేని—నేనక్కడఁబ్రవేశించినతోడనే
క్షణమువలెనున్న ఉడ్రోఫుదొరగారిముండితశ్మశ్రుము
లమునందు,ఘర్మబిందువులు గానవచ్చెను. ఇవాన్సను
రి విశీర్ణవదనపంకజము విశేషముగ వాఁడినట్లయ్యెను.
నవ్యాపియగుబానర్జీగారిగడ్డము, పవనతాడితకదళీపత్
త్రె దీర్ఘనిశ్వాసముచేఁ గంపింపనారంభించెను. ములో
క్రిందదాగియున్న ఘోషుగారికన్ను లశ్రుపూరితమ
ను. పాలితునికృష్ణవదనము కాలిమాస్పర్శమయ్యెను.
గారిక్షీణదేహము లీనముకాఁజొచ్చెను. అవన్నియు
మునకు శుభలక్షణములుగాఁ దోఁచెను—అదిమా
ఆయాశచే ధైర్యముతో దినములనుగడపుచుంటిని.

ఆశతోడను ధైర్యముతోడను దినములుగడ

ఒక మాసము, రెండుమాసములు, మూఁడుమాసములు గడచి
పోయినవి—క్రమముగా సంవత్సరము జరిగిపోయినది. పిమ్మ
ట నాయాశ సందేహముగా మాఱిపోయెను. దేశవాసులగు
కక్షిదారులందఱును నాకు విరోధముగానున్నట్లే కనఁబడియె
ను. నాపేరుసరిగాఁ దెలియక వారువచ్చుటలేదేమోయని మ
ఱింత పెద్దయక్షరములతో బోర్డుగట్టించితిని. వీథినుండియెవ్వ
రైనఁబోవుచున్న చప్పుడైనచో నాయింటికివచ్చుచున్న కక్షి
దార్లనియే నేననుకొంటిని. కొంతసేపైనపిమ్మట—నిరాశ-ని
స్పృహ—అనైక్యప్రధానమైన మనదేశమునందందఱు నీవి
ధముగా నైక్యభావముతోనుండుట నేనెప్పుడును జూడలేను—
అదినాదురదృష్టమో, దేశమునదృష్టమో నేనెట్లు చెప్పఁగలను?

నాకొక గుమాస్తాదొరకెను. నాసౌభాగ్యముచేతనో,
దౌర్భాగ్యముచేతనో, ఆతఁడించుక చతురమతియగుటయే
గాక, ఊరియందున్న టౌటుల (Touts—కక్షిదారులవెంటఁబెట్టు
కొని, వారిని, వకీళ్లనుగూడఁ దినివేయువిచిత్రప్రవర్తనముకల
వారు) కు మిత్రుఁడైయుండెను. ఆతఁ డప్పుడప్పుడు పోలీసు
కోర్టునందలి యొకటిరెండు చిల్లరఫిర్యాదులను దీసికొనివచ్చు
చుండెను. ఎప్పుడోయొక్కసారి—ఒకటికాఁబోలును!—హై
కోర్టుసంబంధమైన వ్యాజ్యమును దీసికొనివచ్చినట్లు జ్ఞప్తియు
న్నది—అదైననెంత? అందువలనవచ్చిన దొకమోహరీ సా

మాత్రకంటె హెచ్చుండదా—చేయునదేమి! ఏదో విధముగఁ గా
లముగడపవలసివచ్చినది. అస్వల్పసంగతులనన్నిటిని చెప్పుకొ
నుట సిగ్గులచేటు—దశాంశిగాండ్రను విడిచినచో గతిలేదు.
ఎక్కడికక్కడకే—దొరకినంతకే—సంతోషింపవలసినదిన
ములు వచ్చినవి! ఇఁక విశేషముగఁ జెప్పుకొనుటవలనఁ బ్ర
యోజనమేమియున్నది?

తుదకు దరిద్రులగువారి వ్యాజ్యములలో రుసుము పు
చ్చుకొనకుండఁ బనిచేయుటకు నిశ్చయించుకొంటిని—అందు
లకును మార్గము లేకపోయినది—నాకంటెఁ పెద్దవారుగనున్న
వారనేకులు స్వార్థమునువిడిచి పరోపకారమును జేయుటకు
బద్ధకంకణులై నిలిచియుండిరి.

నా యవస్థ యిట్లుండఁగా మొదటఁజెప్పినకర్మప్రవృత్తిఫల
మగు నా "లిజ" క్రమముగా వేగముగా ఫలములనీయనారం
భించెను. నాసంతానము కక్షిదారుల దృష్టాంతము ననుసరిం
పలేదు—ఆదినము కాదినము— అక్కఱ లేకపోయినను—
సంతానమభివృద్ధినందుచుండెను. దీనినేగాబా "అయాచితా
నుగ్రహము" అనిచెప్పెదరు.

ఋణము నాసంతానమార్గమునే యనుసరించెను—
తుదకు నేను మహాజనులు, పిటీషనులు మొదలగువానికిఁగూ
డఁ దిరుగవలసినవాఁడనైతిని—

నేను మొదట విలాయతినుండి తిరిగివచ్చినప్పు డిది
యంతటియుపదేశమని యనుకొనలేదు. ఇప్పుడది స్పష్టము
గాఁ దెలియవచ్చెను. ప్లానలుమొదలగు హెచ్చువెలగలబట్టల
ను ధరించుటకు నేను సహింపఁజాలకుంటిని. తెల్లబట్టలు శరీర
మునకు సుఖమునిచ్చునవిగా నగపడియెను. అంతియెకాక,
దొరగారిభోజనముకంటె మనపాత్రములతో వండినయన్న
ము నాకు మిగుల నారోగ్యమొనదని యెక్స్పీరియన్సుచే
(Experience—అనుభవము) తెలియవచ్చెను. కాని, యిది
యంతయు నాభార్యకుఁ దెలియఁజెప్పువా రెవ్వరు? ఆకార్య
భారమును నేనేవహించితిని.

హిందూసుందరి పాకకార్యమునందుఁ గేవలము ద్రౌ
పదివలెను, సహిష్ణుతయందు సీతవలెను, గృహకార్యముల
యందుదాసివలెను, కాక బంకిమచంద్రునిప్రఫుల్లముఖివలెను,
ఉండవలయునని దృష్టాంతపూర్వకముగ ననవరతము నాభార్య
కు నేనుపదేశింపఁదొడంగితిని. హిందూస్త్రీయగునామె సంబం
ధమునందు సహధర్మిణిగను, సేవయందుదాసిగను, ఆహార
మునందు వాయుభుక్కుగను, కార్యమునందు విశ్వకర్మగను
కోపములేకుండఁగను నుండవలయునని యనేకశాస్త్రముల నా
ధారపఱచుకొని విశదముగ బోధించితిని. కాని, యీనాధ
ర్మోపదేశములనువినువా రెవ్వరు? ఆమె యీనాట్యమునకు నే

నే యుపదేశగురువునై యుంటిని. నాయంతట నేనే మొదట నా
మె కావిద్యను నేర్పితిని. ఇంకఁ జేయున దేమి?—నా గృహిణికి
గృహసంబంధమైన యెస్టాబ్లిషుమెంటు (Establishment) నకు
కర్చుతగ్గలేదు.

మొదటినుండియు నెలకు రెండురూపాయలజీతమునకు
న్నయొక యాఁడుదానిని తీసివైచి మాసమునకుఁ బదునేను
రూపాయల నేర్పరచి యొకదాదిని నియమించితిని. అప్పుడు
నాభార్యయగు మిసెస్ రుద్రి. విశ్వాసముగల నా మొదటిసేవ
కురాలిని దీసివేసినందులకై అన్నపానాదులనుమానివైచి క
న్నీటినివిడుచుట నాకు బాగుగ జ్ఞప్తియందున్నది. ఇప్పుడం
దులకుఁ దగినప్రాయశ్చిత్తమైనది. ఆదాదికిబదులుగ పూర్వ
పు సేవకురాలినే మరలఁ బెట్టుకొనుటకుఁ బ్రయత్నించితిని. అం
దులకును నొకగొప్ప యాటంకము కలిగెను. ఇప్పుడు నాభార్య
పూర్వమువలెఁ గన్నీటిచే నేలనుదడుపుచుండు కరుణామూర్తి
గనుండ లేదు. ఆమూర్తి రుద్రిణికిఁ దగినయుగ్రచండీమూ
ర్తియైయుండెను. నేనికఁ జేయునది లేక యాదాదిమానుపిం
చి యితరసేవకు లనావశ్యకమని తెలియఁజెప్పుటకుఁ బ్రయ
త్నించితిని. నాగృహిణి యందులకువిరోధముగా ననేకయుక్తు
లను జూపుచు "డ్రాయింగురూము నూడ్చి బాగుచేయువా రె
వ్వరు? గుమ్మములు నూడ్చువారెవ్వరు? చిల్లరపనులను నెవరుచే

యుండునోయని చెప్పసాగెను డ్రాయింగురూము వ్యాపారము సా
మాన్యమైనది కాదు. అక్కడ జపాను దేశపుఁ బలు తెఱంగులవి
నవకర్రలును, అద్దములును, పటములును, కాచపాత్రములును,
నానావిధములగు కృత్రిమ పక్షులును, గోడలకు వ్రేలాడవేయఁ
బడియుండెను. మూలమూలలయందు, మేజాలును, టేబిలులు
ను, వాట్నాట్లును (What nots) క్యాబినెట్టులును, (Cabinets)
నానావర్ణములుగల రేశ్మన్ వస్త్రపుఁదునుకలచేఁ దయారుచే
యఁబడిన విచిత్రమగు బెత్తములచౌకీయును, సోఫాలును, పీ
కదానులును, పూలదానులును, గడియారములును, మంటిపా
త్రలును, కర్రసామానులును, చీనాదేశపు మఁటిపాత్రలును
కాగితపుసామానులును, ఇంక నెన్నియో నసంగతములు
ను, అనావశ్యకములునగు పదార్థములు, ఫ్రాంసు, జర్మన్
మొదలగు దేశములయందు నిర్మింపఁబడినవన్నియును, గది
నాలుగువైపులఁ గ్రిక్కిరిసియుండెను. వానినన్నిటిని నమ్మివే
యువలయునని చెప్పితిని. అందులకు నాగృహిణి "పిలిచిన పె
ద్దమనుష్యులను గూర్చుండఁబెట్టుటయెక్కడ?" అని యడిగె
ను; నేను "జనులను పిలువకుండుటమంచిది. ఈ సామానులన
న్నిటిని దీసివైచినచో స్థలము విశాలమగునుగాదా!" అని చె
ప్పితిని. దానికి నాయింతి రౌద్రమూర్తిని దాల్చెను. నేనూర
కుంటిని. మొదటివలెనే వంటవాఁడు వంటనుజేయుచుండెను.

బట్లరు(Butlea) మేజాను సిద్ధముచేయుచుండెను. సేవకు లభ్యాగతులకార్డులను దెచ్చి చూపుచుండిరి. బండిసిద్ధముకాగానే గృహిణినన్ను వెంటఁబెట్టుకొని బారులై బ్రికినివిడిచి క్రొత్త క్రొత్తబట్టలను దెచ్చుటకు షాపులకుబయలుదేరి పోవుచుండెను. టీటేబిలు(Teatable)చుట్టును కెన్నిసుదుస్తులను ధరించినవారందఱును వచ్చి చేరుచుండిరి.డిన్నరుటేబిలు(Dinner Table) మీఁద, శూలములును, చంచాలును, చాకులును, గాజుపాత్రిలును ఝుణఝుణశబ్దమును జేయుచుండెను. ఈవినింగుపార్టీ (Evening party) అయినప్పుడు గదిలోనొకమూలనున్న పియానాయను రాగమాలిక స్వరాపస్వరములు పాటింపక మెాయింపఁబడుచుండెను.

సామానులు హెచ్చినకొలఁదిని బీదతనమును మూసియుంచుటకష్టము. పదార్థములు పగిలిపోవును. జోడుగానున్న వొక్కటొక్కటిగా మారిపోవును. క్రొత్తవి పాతవగును. శేష్మన్ బట్టలయంచులనున్నరంగు వివర్ణమైపోవును. చీటిబట్టల పూలపై ధూళిపడిమాసిపోవును. సోఫాపైనున్న మెత్తవిడిపోవును. కాళ్లకుసులూడిపోవును. కుర్చీలకాళ్లువదలిపోవుచుండును. పరదాలకసూతిపనియంతయు శిథిలమైపోవును—అవితూట్లుపడిపోవును. ఇఁక దారిద్ర్యము బయటఁబడుట కేమియభ్యంతరమున్నది?—ఆదారిద్ర్య మైశ్వర్యముయొక్క పత్రిరంధ్రి

ముసుండియుఁ దొంగితొంగిచూచును. క్రొత్తగాఁగొని తెచ్చి కొనివచ్చిన వస్తువుకూడ మెఱుఁగెడలి ప్రాతతుక్కువలెనై మూలఁబడిపోవును. ఒకదానితో నొకటి యతుకదు—ఒకవస్తువొకవైపునమూసికొనిపోవును. వేఱొకవైపున నోరుదెఱచును. కష్టపరియత్నములతో నసామర్థ్యముయొక్క ద్వంద్వలక్షణములు బయటఁబడి జనులకనేకవిధములఁ గనఁబడుచుండును.

నేనీసమాజమునకుఁ జేయిపడితినో యంతయు మఱందునకుఁబోవుట కష్టముగానుండెను. వెనుదిరుగుటకునుమార్గము లేదు—ఈవిధముగ నాలోచించుచు నించుకరక్తవర్ణమిశ్రితమైన కృష్ణవర్ణశరీరములతో నొప్పునాబిడ్డల, కాలరు, టై, ఫ్రాకు (Collar—Tie—Frock—మెడపట్టీ—చిన్నపిల్లల మేలంగీ—లుంగీ) మొదలగువానిచే నలంకరించి, ముఖములకు పౌడరు (Face powder) ను బూసి, హరినొకవిధముగ నాంగ్లేయులుగఁ జేసి, హిందీసంబంధమైనయపభ్రంశభాషను నేర్పుటకు దాదితోఁ బంపుచుంటిని. వారిభవిష్యమెట్లున్నదో తెలియుచునేయుండెను—నాపరిశ్రితస్థితియు దురవస్థలోనికివచ్చినదని చెప్పుట యనావశ్యకము.

మాయూరఁ గొన్నిభూములును, గలకత్తాయందు రెండుగృహములును నాకుఁగలవు—ఇంగ్లాండునకు బయలుదేరి

నప్పుడువానినన్నిటిని విఖ్యాతినొందినయొకయడ్వకేట్కి వశపఱిచి
తిని. అతఁడు చెప్పినమాటలచే— నేను వెనుదిరిగివచ్చినపిమ్మ
ట నాతఁడు నాకిచ్చిన ద్రవ్యములమూలమున నా భూములను
ఇండ్లను విడిపించుకొనవచ్చుననెడియాశ యుండెడిది అతఁడు
నేను వచ్చినపిమ్మట నావైపునకుఁ దిరిగిచూడలేదు. ఇతరుల
కు ద్రవ్యములను దెచ్చియిచ్చుచుండెను — నేనభిమానము
తో నాతనినిబలుకరించుట మానివైచితిని. బ్యారిష్టరు గాను
నువైచికొని, కాలర (Collar) స్వరూపమైనఫణిచే దంశితు
డనై హృదయమునందు వ్యథనొందితిని—

మొట్టమొదట నేను సీమనుండిదిగివచ్చినప్పుడు నాటి
ఫిన్ (Tiffin—ఫలహారము) విషయమునఁ జాలగందరగోళ
మయ్యెను. బారులైబ్రిరీమెంబరులలో నట్టిటిఫిను నెవ్వరును
దీసికొనుటలేదు. క్రమముగా మనస్సున దేశహితైషిత్వము
కలిగి దేశహితముకొఱకు ఇంగ్లీషునందుస్పీచస్సు (Speeches)
ఉపన్యాసములు) నిచ్చుచు, దేశభాషోన్నతికై, యింగ్లీషునందే
యుపన్యాసములను వ్రాయఁదొడంగినపిమ్మట నాటిఫిను,
దేశాభిమానమున బియ్యము, బెల్లము, నేయి వీనిలోనికిఁ బరి
వర్తనమునందెను! కాని, జనులు నాయున్నతోద్దేశములను
గ్రహింపఁజాలక, నన్ను హీనముగఁ జూడఁదొడంగిరి.

జిల్లాకోర్టులస్థితినిజూచుట యైనది. అంతకంటెఁ బట్టణ

మైనక్షణికత్వాయే మేలుగా నగపడెను. ఎందువల్లననగా—
అక్కసబుణమైన దొరకును — పైత్యావులనందులకును
మార్గము కొండదాయెను.

నా [illegible] మల [illegible]కులు [illegible]రిష్టరులును బాయరులు
నుండిరిగాన. గౌతూహలముగలపాఠకమహాశయులు వారినడి
గి నాతరువాతి వృత్తాంతమును దెలిసికొందురుగాక!—అతి
వి స్తరమెందులకు?



# ఉన్మత్త.

ఇది

జి. కృష్ణశాస్త్రులవారి కర్ణాటకగ్రంథమునుండి

శొంఠి గంగాధరరామమూర్తిగారిచే

నాంధ్రీకరింపఁబడి

అయ్యగారి నారాయణమూర్తి బి. యే. బి యల్ గారిచే

సంపాదింపఁబడినది.

మొదటికూర్పు.


ఆంధ్రప్రచారిణీముద్రాక్షరశాలలో

ముద్రింపఁబడినది.

నిడదవోలు.

1914

విడివెల 0-2-6 పోస్టేజి గాక

# అవతారిక.

ఈగ్రంథమును మైసూరునార్మలుస్కూలునందలి సహోపాధ్యాయులగు జి. కృష్ణశాస్త్రులవారిచేఁ గన్నడమున రచియింపఁబడినది. దీని నాంధ్రీకరించి మాగ్రంథనిలయమున ముద్రణస్వాతంత్ర్యముతోఁ బ్రకటించుకొనుటకు శ్రీకృష్ణశాస్త్రులవారుమాకు స్వాతంత్ర్యమొసంగుటచే నీనవలను మాయనుబంధగ్రంథములలో 22 వ గ్రంథముగాఁ బ్రచురించితిమి.

మాగ్రంథనిలయము నందలిదయతో మాకీగ్రంథము నాంధ్రీకరించుకొనుట కధికారమొసంగిన శ్రీ జి. కృష్ణశాస్త్రులవారికి మేమెంతయుఁగృతజ్ఞులమై యున్నారము.

సంపాదకుఁడు.

శ్రీరామచంద్ర.

# ఉన్మత్త.

## మొదటి ప్రకరణము.

ఉన్మత్త మొదటినుండియు నున్మత్త కాదు. పుట్టువెఱ్ఱియును గాదు. నవయౌవనవసంతకాలమున నీమె కీయవస్థ సంప్రాప్తమైనది. మనుష్యమాత్రులకు వారివారి పూర్వకర్మానుసారముగఁ దమతమజీవితకాలములో ననేకావస్థలు సంప్రాప్తములగుచుండును. అట్టి భిన్నభిన్నావస్థలకుఁ బురాకృతకర్మములే కారణము లనిచెప్పుట మన హిందూతత్వజ్ఞానుల మతము. అయినను బ్రపంచకపునడవడికయందుఁ బ్రతివిషయమునకు నేదైన నొక బహిఃష్ప్రాకారణము దోఁచుటసహజమై యున్నది.

అట్లయినచో, ప్రకృతమున మనయున్మత్త కెందులకుఁ బిచ్చిపట్టినదో విచారింపవలయును. ఇందులకు ముందుగా నామెజన్మభూమియగు, నప్పటి బంగాళాదేశకాఁస్థితిని

తెలిసికొనవలసియున్నది. ఆకాలము మనభారతవంశోద్ధారకు
లగునశహారిశ్చంద్రాదుల సత్యకాలమువంటిది కాదు. ఇప్పటి
వలె నాంగ్లేయరాజ్యకాలమువంటిదియును గాదు. ఇంతి
యేకాక, మహమ్మదీయులలోఁ గీర్తిశాలి యగునక్బరువంటి
సత్పురుషునికాలమువంటిదియును గాదు. అది నవాబు సిరాజు
ద్దౌలాకాలము. అప్పుడు నవా బిరువదివత్సరముల పిన్నవ
యసువాఁడు. బాల్యమునుండియు సకలభోగములతోను స్వే
చ్ఛగాఁ బెరిగినవాఁడు. ఈతనిపితామహుండగు నలివర్దిఖాను
మిగుల గారాబముఁజేసి యీతనిపరిపాలనాసామర్థ్యమును
నాశనముఁజేసివైచెను. మఱియును సిరాజుద్దౌలా తనరాజ
ధానియగు మూర్షిదాబాదులో సత్పురుషులతో మాటాడు
టకైన యోగ్యులుకానినీచులతోఁ జేరి దుర్మార్గుఁడయ్యెను.
ఈతఁడును, ఈతనిమిత్రులును వివిధములగు దుష్కృత్యము
లను జేయఁదొడంగిరి. అనేకులదాంపత్యబాధముల నెడబాపి
సంసారములను ధ్వంసముఁజేయుచుండిరి. అనేకుల కులకాంత
లను హరించికొనిపోయి వారిభర్తలకును, తలిదండ్రులకును,
సోదరులకునుగూడ నపారమగు దుఃఖములను, నవమానము
లను గలిగించుటయేగాక వారిని విషపానములకు గుఱిచేయు
చుండిరి. ఎంతఁజెప్పిననేమి! ఈవ్యభిచారియగు మహాపాపా
త్ముఁడు జేసినదంతయును మూఁడునాళ్లపట్టపగలైనను ఆకాలపు

స్త్రీలమర్యాదకు కంటకప్రాయుఁడై యుండెను. ఈతఁడు తు
దకు శూరాగ్రేసరులగు తనసరదారుల కులస్త్రీలఁగూడవిడుచు
టలేదు. వారితనయలుగాని సోదరీరత్నములుగాని సుందరులై
యున్నచో వారినిదెచ్చి తనకుసమర్పింపవలయునని బలాత్క
రించుచుండెను. అట్లుచేయుట కసాధ్యమగుచోట దుష్టులగు
మోసగాండ్రమూలముగ దురాశలనుగల్పించి ఏమియును
దెలియని మృదుహృదయులగుయువతీమణులను మరులుగొల్పి
యైనను. వారిని సత్కులకళంకినులగాఁ జేయుచుండెను.

అప్పుడు మూర్షిదాబాదునందు జగజ్జెట్టు లనుగృహస్థు
లు మిగులధనికులై యుండి యూరం దంతటను గుబేరులని
పించుకొనుచుండిరి. ఎల్లెడలను వారిధనాగారము లేర్పడియు
న్నవి. అంతయొందులకు ? ఈమనభరతఖండములో జగజ్జె
ట్టుల యొకచిన్నబ్యాంకిగాని, వారియేజంట్లుగాని లేనిగ్రామ
మే లేదని చెప్పవచ్చును. పరాక్రమశాలురగు నెందఱో జమీం
దారులును, రాజులునుగూడ వారికి ఋణస్థులైయుండిరి. అఖం
డమండలాధీశ్వరుఁడగు ఢిల్లీసార్వభౌముఁడుఁగూడ ననేకపర్యా
యములా జగజ్జెట్టులగృహములకు వచ్చి ఋణములు తీసికొను
చుండును. మహారాష్ట్రీయులుబంగాళమునకువచ్చినప్పుడు వారికి
భోజనార్థమై వెచ్చించిన కోట్యంతరద్రవ్యముగూడ నాజగజ్జెట్టు
లకుఁ దృణప్రాయమై యున్నది. ఇట్లుండుటవలన జగజ్జెట్టులకి

హిందూదేశములో నెట్టికోటీశ్వరులై, ఎట్టిమర్యాదగలవారై యుండిరో మీరే యూహించి చూడుఁడు !

సిరాజుద్దౌలా సింహాసనాసీనుఁడై నపుడు మతాబచందమునాతఁడు జగజ్జెట్టులకెల్ల యజమానుఁడై యుండెను. ఆతని కత్యంతసౌందర్యశాలినియగు నసామాన్య యనునొక తనయఁ గలదు. ఆమూర్షిదాబాదులో నెచ్చటను మతాబచందుని తనయయంతటి రూపశాలినులెవ్వరును లేనేలేరని చెప్పవచ్చును. నీచుఁడగు సిరాజుద్దౌలా అసామాన్య యనన్యాదృశలావణ్యాతిశయమును జూచి దీపమున కాశించు పతంగమువలె జగన్మోహినియగు నీతరుణీమణిని కామించి మోహపిశాచగ్రస్తుఁడయ్యెను. కాని, యీమె సామాన్యురాలా ? హిందూస్థానమున నంతటను లక్ష్మీపుత్రులని జగత్ప్రసిద్ధులగు జగజ్జెట్టుల కధినాథుఁడును, మహాగౌరవశాలియును, నగు మతాబచందుని ముద్దుతనయయగు కులవధూమణి కాదా ? ఇట్లున్న యీమెను తనకువశపరచుమని చెప్పుటకుఁగూడ నానీచుఁడగు నవాబునకు ధైర్యముండునా ? అయినను మానవుని మనోవ్యాపారములపారములైనవి.

ఒకనాఁడురాత్రి నవాబు స్త్రీవేషధారియై, యింద్రభవనమువలెనున్న యీజగజ్జెట్టి యంతఃపురముఁ బ్రవేశించెను. తత్క్షణమే నిశ్శంకముగా నాలోకైకసుందరియగు నసామా

న్యయున్నస్థలమునకుఁ బోయెను. ఆలావణ్యవతినిజూచి మెచ్చుకొనునంతటి యానందముమాత్రము లభించినను జాలుననియాతనియుద్దేశము. కాని యాసౌందర్య మసాధారణమైనది. కెందామరవంటిప్రసన్నవదనము; ఒయారములగు చూపులుగల విశాలనేత్రములు; మల్లెమొగ్గలనునిరసించు దంతకాంతి; శంఖమునవలెనున్న కంఠము; కిరణములవలెనున్న యంగుళులు; సువర్ణచ్ఛాయగల సుకుమారశరీరము. ఊః! ఎట్లుచెప్పిననేమి? మనము దేని నత్యుత్తమమైనసౌందర్య మనిచెప్పుదుమో, యదియంతయు నామెయందు సహజమై యున్నది. ఇన్నిటిమీఁదను లోకానందమునకుఁ దగిన నవయౌవనము. ఇట్టి స్వభావసుందరికి నాభరణములే యనావశ్యకములు. అయినను, లోకాచారమునకనియు, సుమంగలీత్వమునకనియు నమూల్యములగు కొన్నిరత్నాభరణములుమాత్రమామెమంగళశరీరమున మెఱయుచుండెను. అందులో కెంపులకర్ణభూషణములు, నక్షత్రములనుమీఱు ముగరాలయుంగర, తురుమునందు వైడూర్యములజడపూవు, ఇవియన్నియు నారాత్రి దేదీప్యమానములగు దీపకాంతులలో తళతళలాడుచున్నవి. ఆమెయంగభంగముచే నాకస్మికముగఁ దనపట్టుచీరచెఱఁగును సవరించుకొనఁబ్రయత్నించినపుడెల్లఁ గరకంకణముల కలకలధ్వనియు, తళుక్కునమెఱయు రత్నప్రభయు, గాంచి

నచో నెవ్వరికి నేత్రశ్రోత్రహృదయానందకరముగాకుండును ? సిరాజుద్దౌలాయైనను తాను పుట్టిననాఁటినుండియు నంతటిసుందరీమణి నెప్పుడు నెచ్చటను జూచియుండలేదు. ఎప్పుడాయప్రతిమ యమానుషరూపరాశిని ననిమిషనయనుఁడై చూచుచు నిలుచఁబడియెనో యప్పుడు తన్ను దానే మఱచిపోయెను. తానువచ్చియున్నస్థల మెంత యపాయకరమైనదియో, యాలోచింపక, తననీచవృత్తికిఁదగినచాపల్యమునకు లోనై యాపతివ్రతాశిరోమణివద్దకుఁ దనపాపహస్తమును జాచెను. ఆహా ! పాప మాకులపాలిక యగుబాలిక భయపడియెను. తటుక్కున వెనుకకు జరిగెను. తుదకు దేహమున స్పృహలేనిదై తనప్రాణనాథుఁ డగునిందుసుందరుఁ డున్నప్రదేశమునకు వేగముగఁ బోయి జరగినసమాచారమంతయు నేడ్చుచుఁ జెప్పెను. ఈభయంకర మగుదుర్వార్తను విన్నతోడనే పరాక్రమశాలి యగునామెభర్త కోపోద్రిక్తుఁడై కనులనుండి యగ్నికణములఁ గురియించుచుఁ బరుగిడివచ్చి, యాస్త్రీవేషధారి యగునీచుని వెన్నంటిపోయి కడకు పట్టుకొనియెను. అప్పుడుగూడ నాదుష్టుఁడు గృహమునుండి తప్పించుకొనిపోవలయుననితలంచెను. కాని ఒరిస్సావంగబిహారుదేశసింహాసనాధిపతి యగునొకప్రభువునకేశిక్ష తగనిదో భారతమహిళాపాతివ్రత్యము పరీక్షించుటకును చాలదని యతృప్తిపడుచు

న్నదో అట్టి యొకహీనశిక్షను సిరాజుద్దౌలా యనుభవింపవ
లసివచ్చెను. అనఁగాబహుదినములనుండి యా సామాన్యయొక్క
ప్రాణకాంతుని సుందరపాదారవిందములను సేవించి సేవించి
తనివారుచున్న పాదరక్షలిప్పుడు నవాబుసిరాజుద్దౌలాకు మా
టిమాటికిని శిరోభూషణము లగుచువచ్చెను. పిమ్మట నాక్రూ
రపిశాచమును దిగంబరునిగఁ జేసి శరీరమును కత్తివ్రేటులతో
నలంకరించి గృహమునుండి వెడలఁగొట్టిరి.

కాని, నవాబు తనయాశాభంగమును గూర్చియు తన
కుఁగలిగిన యవమానమును గూర్చియు నెప్పటికిని మఱచిపో
లేదు. కొంతకాల మైనపిమ్మట నిరపరాధియగు నసామా
న్యయొక్కభర్తను వేలకొలఁదిజనులు తిరుగాడురాజమార్గ
మున నురితీయించెను. అంతియేకాక దయావిహీనుఁడగు నాదు
రాత్ముఁ డాశిరమునుమాత్రము ఖండించి యొకవెండిపళ్లెర
మున నిడి పట్టువస్త్రములచేఁ గప్పి దానిని మతాబచందుని
తనయ యగుసామాన్యకుఁ గానుకగాఁ బంపించెను. అప్పు
డామెకుఁ గలిగిన పరితాపమును రౌద్రత్వమును, ఇట్టిదని
చెప్పుటకు మాకు శక్తి లేదు. దౌర్భాగ్యశాలిని యగునాకాం
త శస్త్రాహతమగు తనప్రాణప్రియునిశిరమును నాకస్మికము
గ నెప్పుడాపళ్లెరమున జూచినదో యప్పుడే ,, ఆహా! ఇదే
మి! నాప్రాణకాంతుఁడే! ఇదుసుందరుఁడే! అయ్యో!

ఇదేమియన్యాయము! అయ్యో నాస్వామి! నీ కిట్టిగతి వచ్చి
నదా? ఏమి నానిర్భాగ్యదశ? ఈమహానుభావునితో నవ
పానకాలమునందలి కడపటిమాటయైనను పలుకుటకు లేకపో
యెనే! కాంతా! ఒక్కక్షణములో నన్నునాథను జేసి మా
యమైతివా! నాయందేమియపరాధమును జూచితివి? స
ర్వదా నీపాదసేవనమును చేసికొని ధన్యురాల నగుదునని
నమ్మియుంటిని కాదా! పాపపువిధి దానిని సహింపలేకపోయె
నా? ఏమిచేయను? నిన్ను వదలి యిఁక నెట్లీలోకమున నుండ
గలను? పాపపువిధి! ఈనాపాపపుదేహమునకీపాడుసౌందర్య
మునెందులకిచ్చితివి? పాతివ్రత్యముచే సద్గతిని బొందుటకు మా
రుగ పతిహత్యయను మహాపాతకమునకు గుఱియగుటకు నా
నుదుట వ్రాసితివా? 'భార్యారూపవతీశత్రుః' అను లోకోక్తి
యీరీతిగా నాయందే పరిణమింపవలెనా! అయ్యో! అ
య్యో!" అని గుండెలు బాదుకొనుచు నేడ్చుచు భూమిపైఁ
బడి యట్లే మూర్ఛిల్లెను. ఇంకేమున్నది? ఒక్కక్షణములో
నామె యున్మత్తయైపోయెను.

కాముకుఁడై స్వేచ్ఛాప్రవర్తకుఁడగుసిరాజుద్దౌలా త
నరాజ్యమున నానాభాగములయందున్న మిత్రులయెడలను వ
జీరులయెడలనుగూడ నిట్టి వివిధములగు దుష్కృత్యములను జ
రుపుచుండుటవలన నాతని రాజ్యభారము శీఘ్రకాలములోనే

యత్యముగావలసియుండెను. అంతలో నిదియును సంప్రాప్తమైనది. సిరాజుద్దౌలా పితామహుడగు నలివర్దీఖాను తాను మక్కాకు యాత్రకుబోవునప్పుడు సిరాజుద్దౌలాకు సహాయముగ నుండుమని యొకపఠాణవజీరుని నియమించిపోయెను. కాని, సిరాజుద్దౌలా నిర్వివేకుడును, దుష్టుడును, దుర్బలుడును, నీచుడునై యుండెనని జనులకు దెలిసినతోడనే సంస్థానమునను్న వజీరులు తమతమ యిష్టప్రకారము వ్యవహరింపసాగిరి. తుదకు దమయిష్టమువచ్చినవారిని సింహాసనమున నుంచుటకును తొలగించుటకునుగూడ నీవజీరులే స్వతంత్రులైరి. పెక్కుదినములవఱకును నీమహీశుని దుర్నయములను జూచి చూచి విసుగుచుండిరి. తుదకెట్లయిన నీచుడును, ప్రజాకంటకుడు నగుసిరాజుద్దౌలాను సింహాసనమునుండి తప్పించి ముఖ్యాధికారి యగుమీర్జాఫరునికి బట్టముగట్టవలయునని యోజించిరి. మఱియు నీక్రూరుడగుసిరాజుద్దౌలాను నిగ్రహించుటకొఱకు ధర్మప్రవర్తకు లగునాంగ్లేయులను సహాయమునకు బిలిచిరి. సిరాజుద్దౌలా ఘోరపాతకమువలన కలకత్తాయందలి తమోగృహంబున వందలకొలది స్వజనులను పోగొట్టుకొని యున్న యాంగ్లేయు లిప్పు డాతనిని నిర్మూలనము జేయుటకొఱకుసంతోషముతోనంగీకరించుట చేప్లాసీరణరంగమున యుద్ధము ప్రారంభమయ్యెను. నవాబుసైనికు లాంగ్లేయులమీద నురు

కుటకు సిద్ధమైయుండిరి. కాని, సిరాజుద్దౌలా తనకాప్తునివలె న
టించుచున్న మీర్జాఫరుని యాలోచననుబట్టియే వారినెదురిం
చుటకు తడవుచేసెను. అట్టిసమయముకొఱకే నిరీక్షించికొని
యున్న యాంగ్లేయసేనానాయకుఁడగు క్లయివుని వీరసైన్యము
సింహనాదముఁ జేయుచు, భల్లములను ఝళిపించుచు, వెడలి
తురకసైన్యముపైఁ బడి వారిని సంపూర్ణముగ నోడించెను.

పిమ్మట సిరాజుద్దౌలా తనరాజధాని యగుమూర్షిదా
బాదునకుఁ బారిపోయి యచ్చటఁగూడ తాను బ్రతుకఁజాలన
ని తెలిసికొని పచ్చిమదిక్కునకుఁ దప్పించుకొనిపోయెను. ఎక్కు
డకుఁబోయినను విధి విడుచునా? భోగబంగాళా యనుస్థలమున
నాతనిఁ బట్టుకొని తిరిగి మూర్షిదాబాదునకుఁ దెచ్చిరి. అదివఱ
కప్పుడే మీర్జాఫరు క్రొత్తనవాబై యుండెను. అతనితనయుఁ
డగు మిరాన్ అనునాతఁడు మహమ్మదుబేగ్ అనువానిచేత
సిరాజుద్దౌలాకు బరలోకప్రయాణముఁ జేయించెను ఒకరాజ
ద్రోహికిఁ జేయునట్లాతనిశవము నేనుఁగుపై నుంచి యవమా
నపూర్వకముగ రాజవీథులన్నియు నూరేగించి యొక్కచోఁ
బూడ్చిరి.

పతిభక్తిపరాయణయై, పతివియోగకాలమునుండియు
లోకపరిజ్ఞానమే లేక యున్మత్తయైయున్న యసామాన్య యీ
దినమువఱకు నట్లే యున్నది. ఆమెపుట్టువెట్టిదనినే యైనది.

కొన్నిసమయములలో చెవులు వినఁబడుటలేదు. నాలుకయో తిరుగుట లేదు. కొన్నివేళల రాక్షసస్త్రీవలెను, రక్తపానాపిష్ట యగు నాదిశక్తి చండికవలెను నెరుగుదు నెవరికిని బట్టుకొనుటకైన సాధ్యముగాకుండ నుండెను. ఒక్కొకసమయమున నిష్కారణముగ నవ్వుచుండును. అయ్యో! ఏమంగళమూర్తి యగునసామాన్యముఖమండలము తల్లిదండ్రులకు సంతోషమును గలుగఁజేయుచు, మనోహరునికి మనోల్లాసముఁగూర్చుచు, సేవకుల కనుగ్రహమును సూచించుచు నుండెనో అట్టిమహనీయురాలిముఖమండలమిప్పు డెల్లరికనికరమునకుఁబాత్రమైయుండెను. ఆహా! ఇదేమికాలవైపరీత్యమో, లోకమాన్య యగునా సౌందర్యరాశిని సృష్టించినబ్రహ్మతప్పిదమో, ఆపాపాత్ముని పాపకృత్యఫలమో, కాక యసామాన్య నిర్భాగ్యపరిపాకమో, తుద కేదైననేమి? పాప మాకులకాంత నీస్థితికిఁ దెచ్చెను. తండ్రి యగుమతాబచంద్రుఁడు బహుప్రసిద్ధులగున నేకభిషగ్వరులచే వివిధము లగుచికిత్సలను జేయించెను. అయినను, "మనోరోగమునకు మందులేదు" అనునట్లింతయును వ్యర్థమైనది.

సిరాజుద్దౌలా కాదినముననే మరణమగునని సమాచారమును దెలిసిన యొకకాంత వచ్చి—"ఈమెను సిరాజద్దౌలా సమాధిస్థలమునకుఁదీసికొనిపోవలయును. ఏనీచనవాబుచేఁ దన నాథుఁడు మరణించియుండెనో, యాతనిరక్తమాంసాదులనుజూ

చినచో నీమె తృప్తినొందఁగలదు. తనప్రాణనాథున కన్యాయముఁ జేసినవానికిఁ దగిన శిక్షయగుటను జూచి ఈమెకు సంతోషముఁ గలుగవచ్చును.'' అనియాలోచనముఁ జెప్పెను. తన యు క్తెట్లయినను గుణమైనఁజాలునని మతాబచందా మెనట కుఁ బంపించెను.

పైనిఁ జెప్పినట్లు రెండున్నరసంవత్సరములు దురవస్థ ననుభవించిన పిమ్మట నీవిచిత్రచికిత్సచే నించుక యారోగ్యము గలిగినట్లయినది. ఈమె యాశవమును కొంచెము సేపు బాగుగ దృష్టించిచూచి తరువాత తనప్రక్కనున్న సేవకురాలి వైపునకుఁ దిరిగి—,, ఏమే, ఈనీచప్రాణి యెవరు ? ఏతప్పు నకై యీతనిశరీర మిట్లు భిన్నభిన్నములుగా ఖండించియుండిరి ? '' అని యడిగెను. అందులకు సేవకురాలు—,, అమ్మా ! ఈద్రోహియే నీప్రాణకాంతుని జంపినఘోరపాతకుఁడు. ఈతఁడే ప్రజాకంటకుఁ డగుమనదేశపునాబైన సిరాజుద్దౌలా. తనదుష్కృత్యములకుఁ దగినఫల మిప్పు డనుభవించెను. '' అని చెప్పెను. అయిననేమి ? ఆమెచెప్పినమాట యున్మత్త కర్థమేకాలేదు. ఒకక్షణములో, వర్షాకాలపునిశి యందలి యంధకారములోఁదళుక్కునఁ బ్రకాశించు మెఱుపుఁ దివవలె, నాయున్మత్తమనసునకుఁ దట్టున నేదో యొకకాంతి గోచరించెను. అప్పుడామె—,, ఓహో ! ఓహో ! తెలిసిన

ది ! " అని గంతులు వైచి " ఇఁక నింటికిఁ బోవుదము, నడు
వుము ! అమ్మా ! నడువుము ! " అని కేకలిడుచు వచ్చెను.

పిమ్మట నీమెను తిరిగి వెనుకకు మతాబచందుసుం
దరమందిరమునకుఁ గొంపోయిరి. అటుపిమ్మట నున్మత్త మొ
దటివలెఁగాక శాంతచిత్తయై యుండెను. తనతండ్రితోడను,
మిత్రులతోడను, నెంతో జ్ఞానముతో మాటాడుచువచ్చెను.
ఎల్లరకును హర్షాశ్చర్యములు గలిగినవి. ఆమె యున్మాదవిము
క్త యగుటచే నెల్లజగజ్జెట్టులకును, తుద కొక్కమారుగ
నామూర్షిదాబాదునగరమునకే యపారసంతోషముఁ గలుగఁ
గాఁ నిఁక నంతఃపుర జనులకును తల్లిదండ్రులకును గలిగినయా
నందాతిశయమునకు మేరఁగలదా ? కాని యా ధనికకుమారి
యప్పుడప్పుడు " నేను జేయవలసినదానిని దేవుఁడు చేసియు
న్నాఁడు. నేను చేయవలసినదాని నాతఁడే చేసినప్పుడు ఆతఁడు
చేయుదానిని నేను చేసియేతీరవలయును. అందువలన నా
తని కర్తవ్యమును నేను జేయుదును. " అని చెప్పుచుండె
ను. కాని యామె యిట్లు పురశ్చరణఁ జేయుచున్న యీమం
త్రముల కెవ్వరికిని దాత్పర్య మగుట లేదు. తుట్టతుదకు జను
లకు వీనియర్థముఁ దెలియుచువచ్చెను. కాని, ఏమిఫలము ?
మిగులఁ దడవైనది.

ఉన్మత్తకుమారి, తనభర్తను వధించి, తనపాతివ్రత్య

మునకుభంగముఁగలుగఁజేయ దలఁచియున్న యామహాపన్నవీ యునిరక్తమును, నాతని సకలావయవముల నున్నమాంసఖండ ములను జూచినప్పటినుండియు నామెమనసున నొకయభిప్రా యము పుట్టినది. మాటిమాటికి దానినే యోచించుచుండు టచే నామెకుఁ దలతిరుగుచువచ్చెను. అప్పుడు తనకుఁదానే యిట్లు చెప్పుకొనుచుండెను. “ అసామాన్య తనప్రాణనాథున కుపహాతి జేసినవానిని సింహాసనమునుండి తప్పించి చంపించి మోహపిశాచపీడితుఁ డగు నాతని దేహమును భిన్నభిన్నములు గా ఖండించి పగదీర్చికొనవలసినదై యుండెను. కాని యామె కొఱకు దైవము సమస్తమును దానేచేసియుండెను——మఱి యొకవిధమున యోజించినచో దీనబంధు వనిపించుకొన్న సక లలోకహితుఁ డగుజగదీశ్వరుఁడు తనకరుణామాహాత్మ్యమున కను సారముగ నాదుష్టుఁ డగుయువకుని నెట్లయినను రక్షించి యాతని కేదైన నొకయుపకారమును జేయవలసియుండెను. కాని, దేవుఁడు దానిని జేయలేదు. ఆకార్యము నసామాన్య యే చేయునని నాభాగమునకే విడిచి యున్నాఁడు. దానిని నేనైనను చేసిమేతీరవలయును. ” అని యనుకొనుచుండెను.

దీనినిబట్టిచూడఁగా వెనుక నామె జపించుచుండిన మంత్రమున కిదియే వ్యాఖ్యానమై యుండవలయు ననితోఁచు చున్నది. తుదకున్మత్త సిరాజద్దౌలా కేదైన నుపకారముఁ

జేయవలెనని నిశ్చయించుకొనియెను. కాని, రక్తసిక్తమైయు
న్న యాతని దేహము గంగానదీతీరమున గోరీలో స్థాపితమై
యున్నది. ఆతనియాత్మ యమలోకమున మొదటితరగతిశిక్ష
నే యనుభవించుచుండవచ్చును. ఇట్టివాని కేమియు నెఱుఁగని
యీకాంత చేయు నుపకారమేమి? ఎట్లుగా సాధ్యమగును?
అయ్యో! భ్రాంతి, కానిమ్ము! ఈమె యిష్టమువచ్చినట్లు
జేయనిమ్ము! ఎట్లుచేయునో చూతము! నడువుఁడు! మన
మెందుల కడ్డుమాటాడవలయును?

ఒకానొక దినమున నర్ధరాత్రిసమయము. అర్ధచంద్రబిం
బము తన యర్ధప్రభతో నంపాలు పైకి వచ్చి పూర్వదిఙ్మం
డల మలంకరించెను. ఈసమయమున నర్ధోన్మత్త యగు నే
దోయొక వ్యక్తి తన మూలమంత్రముల నర్ధార్థముగా నుచ్చ
రించుచు మతాబచందునిమందిరమునుండి వెలుపలకు వచ్చి
ముందుముందునకు జరగుచుండెను. అచ్చటి ద్వారపాలకు
లలో „ హీరాలాలు, పీర్ఖాన్ " అను నిరువురుమాత్రము
దమవంతుకాపలికై హెచ్చరించుకొనుచుండుటయేకాక, అ
గ్నిహోత్రములనుజేయుచుఁ (పొగద్రావుచు) చిన్నచిన్న మేఘ
ములను బుట్టించుచుండిరి. ఎప్పుడు మనుష్యులసందడి—అం
దులో లోపలినుండి వెలుపలకువచ్చు సందడి—వినఁబడునో,
అప్పుడు వారు భయభ్రాంతులై దగ్గరలేచి— „ పకళ్లేవ్,

చోరాక్ '' దొంగను పట్టుకొనుము '' అని గర్జనము సేయు చు, ,, సిద్ధపత్రము శివజ్ఞాన '' మనునట్లు బ్రహ్మానందమునఁ జేరియుండిరి. ఆహా ! సిద్ధపత్రమా ! గోసాయీల జీవరత్న మా ! భట్టోపాధ్యాయుని భండారమా ! సోమరులకు నీవే సంజీవనివంటిదానవు కాదా ? ఎట్లయిన తుదకుఁ బ్రపంచమం తటను నీమహిమయే వ్యాపించియున్నది.

ఆవ్యక్తి వేగముగ నడచివచ్చెను. వీథివీథియందును సుఖనిద్రలనుసూచించు గురకలుతక్క మఱేమియు నువినఁబడుట లేదు. ప్రకృతి శాంతమై యున్నది. కాని యాసమయమునఁ గ్రొత్తవారినిజూచినచో నూరకుండఁగూడదని తమపద్ధతికిఁ దగినట్లు కొన్నివైపులను గ్రామసింహములుమాత్రము గర్జిం చుచుండెను. మొఱఁగెడుకుక్క కఱవదని యెవరికి తెలియదు?

ఈకాలమునఁ గొన్నిగ్రామములలో నగరాధికారుల గృహాంగణములయందువలె నారాత్రి మూర్షిదాబాదులోఁ గొన్నిధనికగృహముల ముంగిళ్లయందుమాత్ర మొక్కొకదీప ము వెలుగుచుండెను.

ఆపూర్వకాలమున నగరరక్షణముకొఱకు నిప్పటివలె పోలీసుజవానులు లేరు. అప్పుడు ప్రతిగృహమందును, ఎనా మిల్దుపాత్రములు, కాచనిర్మితదీపోపకరణములు వార్తాపత్రిక లు వేత్రాసనములు కాష్ఠాసనములు, షర్టు, కోటు, జాకెట్లు,

మొదలగు విచిత్రములగు వస్తులు, ముఖక్షౌరపుఁగత్తులు ఫోటో చౌకట్లు, బ్రాండిసీసాలు, సబ్బుబరిణెలు నిట్టియావద్ధనములగు సమాల్యకస్తువులు లేకపోవుటచే నింతప్రబలమగు సుశిక్షితమైనకార్యబలమును, పోలీసు అధికారులను నియమింపవలసిన మావశ్యకము లేకపోయెను. కొత్వాలు లను కావలివారుమాత్రము రాత్రివేళల బాకాలతోడను డప్పులతోడను రెండు మూఁడుసారులు గస్తితిరుగుచుండిరి.

ఆసౌధమున వెలుపల బంధుబలగములందు నెన్నో సమారంభములు జరుగుచున్నవి. తదంగములగు మోక్షానాలయందును, చిన్నచిన్న యుగ్రాణములయందునుగూడ గొప్పసమారాధనములు జరుగుచుండెను. అచ్చటచ్చట మార్జాలదీక్షితులచే మహాసకయాజ్ఞములును జరుపఁబడుచుండెను.

ఊరు వెలుపల నుద్యానవనములందలి వృక్షశాఖమై హిమకణములు బిందుబిందువులుగాఁ జేరి యున్నవి. వానిని జూచినవో, కష్టములకులోనైనవారిని జూచి కనికరమువలనఁ గన్నీరు విడుచునట్లు దోఁచుచున్నవి. పక్షిపుంజము లొకకాలితోఁ జెట్టుకొమ్మఁ బట్టుకొని కూరుచుండి వేఱొకకాలు ఱెక్కలోనిమిడ్చికొని నిమీలితాక్షములై శత్రుపక్షపూరాకములవంశోచ్ఛేదనమునకై ఘోరతపమును జేయుచున్నట్లుండెను. ఆఘూకమాలిన్నో, అచ్చటచ్చట నతున్నతవృక్షములపైఁ

గూరుచుండి తమరాజ్యమును సర్వేచేయుచు "గుర్గూ" జయఘోషములను ప్రకటించుచుండెను.

ఇంకముందు ఘోరారణ్యము. ఆమహారణ్యసామ్రాజ్యముననొకపులిరాయఁడువచ్చికబయళ్లలోనున్నఱాతిపలకపైఁ బూర్వాభిముఖముగాఁ గూరుచుండి, హిమకరునివైపుఁ జూచి యాలోచించుచుండెను. గజరాజు, కుటుంబసమేతుఁడై పొలముగట్లవెంట బయలుదేరి సస్యములను భుజించుచు నానందాతిరేకమున ఘీంకరించుచుండెను. కొన్నిగుంటనక్కలు పొంచి పొంచి తమ హరణభరణసామర్థ్యమంతయును వెచ్చించి, కొన్నిపల్లెలనుండి గృహపతంగములను వేఁటాడికొనుచు వచ్చుచుండెను. ఈగద్దలమును జూడవలయు ననునుద్దేశమువలననో యనునట్లు నిశానాథుఁడింక నుబై పైకి వచ్చుచుండెను. యివియన్నియుఁ జూచుచు మెల్ల మెల్లగ నడుచునట్లు నీలాకాశమార్గమున గ్రహములు పూర్వదిశనుండి పశ్చిమదిశకు మరలుచున్నవి. తుదకు సార్వభౌముఁడగుసూర్యునకుఁగూడ నెట్లో యీవర్తమానముఁ దెలిసి యాతఁడును వీనినిజూచుటకువచ్చునట్లు సన్నాహ మగపడిమెను. అప్పుడు మృగములన్నియుఁ దమతమనివాసములకుఁ జేరుకొనినవి. చల్లగాలి యరవిరిమొగ్గల పరిమళపరాగమునెగురవైచుచు వచ్చెను. పతంగములు మంగళగానముల కుఁబ్రారంభించినవి.

అనసూయయునకు మనయున్మ త్తన్య క్తి యెన్నియో పల్లెలను దాటి బహూదూరము నడచెను. పాఠకులారా! ఉన్మత్త న్యక్తి యెవరైనదియు నిదివఱకు మీకును దెలిసియుండవచ్చును. మనయున్మత్తనే యిదివఱకు నూరక వ్యక్తియనిపిలుచుచుంటిమి. అయ్యో ! బాలిక! అరణ్యమున కేలపోయెను? ముందెచ్చటకుఁబోవును! దైవముమాత్ర మెఱుఁగును. చింతాపరవశయగు నాబాలికకుఁ దనయుద్దేశము తనకే తెలియదు. ఇంతియే కాక, గృహమువిడిచి బయలుదేరి వచ్చినది.

ఈమె ప్రయాణమున నొకయుద్దేశ ముండును. సిరాజుద్దౌలాగతి గంగపాలైనను, నాతనిరక్తసంబంధులలో నెవరైన నొకరైనను బ్రదికియున్నయెడల నట్టివారి కుపకారముఁ జేసినను సిరాజుద్దౌలాకుఁ జేసినట్లే యగునని యామెనమ్మకము. ఇప్పుడిదియొక విధమగు నున్మాదము వచ్చి యాక్రమించినది. ఎట్లయిన నసామాన్య యను పేరుకంటె నున్మత్తయనుటయే యీమెకు యోగరూఢినమ్మతనుగు నామధేయముగఁ బరిణమింపవలసియుండెను.

సిరాజుద్దౌలాప్లాసిరణరంగమున నోడిపోయిమూర్షిదాబాదునకువచ్చి యచ్చటనునిలువక నెప్పుడుతలదప్పించుకొనిపోవయత్నించెనో, అప్పు డాతనిస్నేహితులును, రాణివాసము, నొక్కనూరుగ వందలకొలఁది యాతనితో బయలుదేరిరి. అయిన నేమి? న

డుమనడుమ మార్గములలో వచ్చి చేరుచున్న యసాధారణక
ష్టపరంపరలను సహించుకొనఁజాలక యనేకులు;—, అయ్యో!
ఈనవాబు పాడైనచో మనకేమి? ఈతనితో బయలుదేరి వే
శకు సరిగా నన్నమును, నిద్రయును లేక, త్యాగభోగములు లే
క, శత్రువులెక్కడవత్తురో యనిమాటిమాటికి బెదరుచు, ని
ట్టిదినగండములను, క్షణగండములను ననుభవించుటకు నెవరిక
లసనగును! ఈతనిని నమ్మియున్నందుల కిట్టిగతి యైనది.'' అని
గొణుగుకొనుచు నాదుష్టనవాబు నప్పుడును పీడించి యాతనిశి
బిరమందలి యాపద్ధనమైన నగనాణ్యములలోఁ గొన్నిటిని
దొంగిలించుకొని తమతమయిష్టమువచ్చినస్థలములకు వెడలి
పోయిరి.

అయ్యో! సిరాజుద్దౌలా! ఆయౌవనమదాంధతచే వివే
క లేశమును లేక స్వేచ్ఛావిహారముఁ జేయుచు ప్రపంచమే నీచేతి
లోనిదని యెంచికొనుచు, నెంతయో దురహంకారమున మెర
యుచు చతురంగసైన్యపరివృతుఁడవై రత్నాలంకారములను
ధరించి రాజవీధులందు సంచరించునప్పుడు ప్రభువే తండ్రియను
సద్భావముతో నాదరపూర్వకముగ నిన్నుఁజూడవచ్చుచు నిరుగె
లంకుల గుంపులు గుంపులుగాఁ జేరియున్న ప్రజాసముదాయ
మధ్యమున పాపాభిప్రాయముతో స్త్రీసమూహమునుమాత్ర
మే చూచుచు నట్టహాసము చేయుచున్న పీకసులలో నిప్పుడు రక్త

ము ప్రవహించుచున్నను దానిని జూచు సత్పురుషులకుఁ గన్నీ రైన రాదుగదా! అట్లయినచో వారికికరుణలేదా? కాక, ఇది నీదౌష్ట్యఫలమా? పొమ్ము! నీకర్మము నీకైనది!

నవాబుపరివారజనము, ఆప్తహితులు, బంధువులు, రాణివాసము, వీరెల్లరును విడిచి వెడలిపోయినచో నీతనికిఁక దిక్కెవరు! "నీగతియిట్లయినదికదా!" అని జాలిపడువా రుకూడ లేనేలేరు! ఓహో! అట్లనఁగూడదు. సిరాజద్దౌలా యిట్లు నిర్భాగ్యుఁడైనను, నీతనియొద్ద నొకజీవరత్న ము న్నది. ఈతఁ డెన్నిదుర్మార్గములను జేసినను, ఈరత్నము నను మాత్ర మెన్నఁడును విడిచియుండలేదు. ఇదె యీతని భాగ్యల క్ష్మి. ధనాశచే సంపత్కాలమునమాత్రము కపటస్తోత్రము లను కపటోపచారములను, చేయుచు పరిణామమున నర్థహా నియు, మానహానియుఁ దుదకుఁ బ్రాణహానియును జేయు నట్టి నీచపదార్థముఁ గాదు. అయినచో నిది యెద్ది? సిరాజ ద్దౌలా ప్రాణప్రియయును, ఎన్నఁడును వాఁడని గులాబీపూవును నై యున్న యాతని ధర్మపత్ని యగుమీరఉన్నీసాబీగము. ఇప్పుడందఱువిడిచినను మీరఉన్నీసామాత్రము విడువలే దు. కట్టి ప్రాణాపాయసమయములో నాథుని నాదరించుచు ధైర్యమును, వివేకమును, జెప్పుచుండెను. అయ్యో! వెఱ్ఱి పిల్ల! ఈమె కేమియును బుద్ధిలేదా! మొదటినుండియు తన

మాటను వినియున్నచో నిట్లు కాఁజాలదని సూడఁ దెలిసికొన
జాలని నాథునకింకను వివేకముఁ జెప్పుచున్నది ! చెప్పనిమ్మ!
చెప్పనిమ్మ !

మీరఉన్నీసాకుఁ బిన్నవయసు. ఇంకను పదునాఱు
వత్సరములే. అయినను, మిగుల బుద్ధిమతి. అంతఃపురదాసదా
సీజనమును మిగులభద్రముగా నడపించుచుండెడిది. అంతటి
సుకుమారశరీరముగలదై, నవమాసములు నిండి పూర్ణగర్భిణి
యగుసీకోమలాంగి యీనిర్భాగ్యపతిని బడసినతప్పునకు నిప్పు
డు రాళ్లలోను, ముండ్లలోను, నడచుచు, ఘోరారణ్యమున
దారిగానక, గర్తములఁబడుచు, నీపాపాత్ముఁడగుభర్తతో
నేడ్చుచు, పాదములనుండి రక్తమును, కనులనుండి బాష్పము
లును ప్రవహింపఁ గష్టపడవలసివచ్చెను. అట్లెచ్చటెచ్చటనో
తిరుగాడుచు నీదంపతులు భోగబంగాళా యనుస్థలమునకు
వచ్చి చేరిరి. అక్కడ—అంతటిదిక్కులేనిస్థలమున—ఈబంగా
ళామహారాణి యొకకన్యకను బ్రసవించెను. ఈజన్మోత్సవము
మూర్షిదాబాదులో తనయంతఃపురమునందే యైనచో నెంత
విజృంభణముతో జరుగవలసియున్నదో ! ఇప్పుడా దాదు
లెక్కడ ? చెలికత్తెలెక్కడ ? ఆమంగళవాద్యము లెక్క
డ ? ప్రతివీథియందును చక్కెరబండ్లగద్దలము, బాలకులసం
దడియు నన్నియు నెక్కడకుఁ బోయినవి ? తుదకు వీరలీ

కారణమువలనఁ జాలకాలము భోగబంగాళాయందే యుండ వలసివచ్చెను. కాని, యట్లుండుటచే బంగాళానవాబైయున్న సిరాజద్దౌలా నుదుటివ్రాఁత తొలఁగిపోయినది. ఎట్లనిన— ఈభోగబంగాళా యనుస్థలమునుండియే యీతనిని తీసికొని పోయి యీతనిభూలోకజీవనమునకు సమాప్తిఁజేసియుండి రనుసంగతి మనకు మొదటనే తెలిసియున్నది.

ఈసమయమున మీరఉన్నీసా మొదటికంటె నధిక కష్టములకు లోనయ్యెను. ఎంతటికష్టములయందైనను తన్ను ప్రాణప్రియయని భావించి గౌరవముతో నాదరించుచు, నే ప్రాణనాథుఁడు ప్రేమించుచుండెనో యట్టిభర్తనుగూడ దుష్ట దైవము తొలఁగించెను. బంగాళా, బిహార్, ఒరిస్సా, రాజ్య ములకు నిరంకుశప్రభు వగునవాబునకుఁ బట్టమహిషియై వం దలకొలఁది దాసదాసీజనుల కాశ్రయమై, వారినిరక్షించుచు న్న యీమహారాజ్ఞికిప్పుడీభోగబంగాళాయందలి యొకపల్లె వీథియం దొకపేదవృద్ధురాలి యాశ్రయమున జీవింపవలసి వచ్చినది. ఆవృద్ధురాలీమెకుసంప్రాప్తమైన విపత్పరంపరలను జూచి మనసుకరఁగి యీమాతాశిశువుల నతిరహస్యముగ సంరక్షించుచుండెను. ఆహా! ఆమె యెంతదయామయి! సి రాజుద్దౌలా యనినచో చిటచిటలాడుచు, వానిని, వానిరక్త సంబంధులను, తనకు వాఁడు సంబంధివాఁడని చెప్పినవారినిగూడ

చూచినతోడనే పట్టిచంపుచున్న నిష్కరుణస్వభావులగు యోధులగద్దలమునకును వాని సాధ్వియగుపత్నిని, వాని ప్రతిబింబమగుశిశువును ఈవిషమసమయమున నింత ధైర్యముగాఁ దనగృహమునందే యుంచికొని కాపాడుచున్నదికాదా!

మీరఉన్నీసా యిప్పటనే యొకటిన్నర నెలవఱకు సురక్షితముగ నుండెను. పిదప నెవ్వతెయో యొకకాంత తన్నుఁ వెదకుచుఁ దిరుగుచున్నట్లు తెలియవచ్చెను. ఉన్నీసా తనప్రాణమునకై యించుకయును భీతిల్లుట లేదు. అయినను, నీమె ప్రాణమంతయును బిడ్డయందే యున్నది. అందువలన నాపిల్లకొఱకు దాను తనపతినిజంపిన క్రూరులచేతులఁ బడకుండ నున్నది. ఇట్లయిన నేమిచేయవలయును? ముందాలోచనమేమి? ఇప్పుడేమియును తెలియకయే యున్నది. ఢిల్లీసామ్రాజ్యమునకుఁ దనభర్త నామమాత్రమునైన సామంతరాజై యుండెనో, యాపాదుషహాపాదములపై నీనిర్భాగ్యశిశువును బడవైచి, జరిగినసమాచారమంతయును విన్నవింపవలసి యున్నది. అట్లు చేసినయెడల సార్వభౌముఁడేదైన నొకయేర్పాటుఁ జేసి తనతనయకాధారభూతుఁడై యుండునని యామె నమ్మియుండెను.

ఉన్నీసా పైనఁజెప్పినట్లు తన్నెవ్వరో వెదకుచున్నట్లు తెలిసినతోడనే వికలహృదయ యయ్యెను. ఆమె సర్వాం

గములును గంపించినవి. పెదవులు చలించిపోవుచుండెను. బిడ్డ
నుజూచి కన్నీరు స్రవింపఁజేయుచుండెను. కాని తనమనసునకు
వచ్చినట్లు గట్టిగా నేడ్చుటకైన నున్నదా ? అయ్యో ! మన
యేడుజన్మములనుండియు నున్నశత్రువులకైన నంతటివిపత్తు
రావలదు. ఉన్నీసా చతురయగుటవలన నింకను నాలస్య
ముఁ జేసినచో కార్యము చెడుననియూహించి తత్క్షణమే తన
పాలబిడ్డ నొడిలో హత్తించుకొని యెవరికిని దెలియకుండఁ బ
రువెత్తిపోయెను.

ఆహా ! పుత్రవాత్సల్యము ! దీనిమహిమ సంతానసం
తుష్ట లగుయువతీమణుల మృదుహృదయములకు గోచరించును
గాని, యితరుల కిది లేశాంశమును దెలియుదని ధారాళముగాఁ
జెప్పినను నతిశయోక్తి కాఁజాలదు.

ఇఁక నావైపునకుఁ దిరుగుదము. పల్లెపల్లెకును, వీథివీథి
కిని నింటింటికిని పోయిపోయి సిరాజద్దౌలా రక్తసంబం
ధులనే వెదకుచున్నవా రెవరైయుండవచ్చును ? ఇంకెవరు ?
చూచుచునేయుంటిమి. మన యున్మత్తకుమారియే. మతాబ
చందుని ముద్దుతనయయగు నీబాలిక యెంతదూరము వెద
కుచుఁబోయినను తాను వెదకుచున్నవారిని జూచి మాటాడించి
నిలిపికొనుటకు సాధ్యము కాలేదు.

ఆ పేదరాణికైననో, ఎవ్వరోయొకరు తన్ను నీడవలె

వెంబడించియున్నారనిమాత్ర మెఱుఁగును కాని, వారియుద్దేశ మెట్లు తెలియఁగలదు ? మృగయునిచే వెంబడింపఁబడిన లేడిపిల్ల వలె భయభ్రాంతయై యాయువనమహిషి యెచ్చటను నిలువఁ జాలక నెంతో శ్రమపడుచు గంగానదీతీరమునకుఁ బోయెను.

ఏమైనట్లు ? అక్కడను నిశ్చింతగా నుండుటకు లేదు. వెనుక గొయ్యి, ముందు నుయ్యి, అనునట్లయినది. తన్ను వెన్నంటివచ్చుచున్న భూతము దృఢప్రతిజ్ఞతో నక్కడకును వచ్చియేయున్నది. తుట్టతుద కున్నీసాయున్మత్తస్థితిలోఁ జిక్కవలసివచ్చినది. ఇంతయగునప్పటికి సిరాజద్దౌలా మరణించి మూఁడువత్సరము లైనది. ఈమూఁడువత్సరములలో బంగాళా పట్టపురాణి తన్ను రక్తపానము జేయువేఁటకుక్కవలె నాత్రముతో నంటివచ్చుచున్న యువతిహస్తమునకుఁ జిక్కకూడదని యెన్నెన్నో పాట్లు పొందియుండి గర్తములయందు దాఁగి, వృక్షచ్ఛాయలను నిలిచి, గోడలను దుమికి, వేషభాషణములను మార్చుకొని, పల్లెలకును, నగరములకును, గహనములకును, నెచ్చటెచ్చటకుఁబోయినను "ఇక్కడకును వచ్చితివా శంకరా ?" అనునట్లు నెక్కడనిలుచుండి యించుక వెనుకకుఁ జూచినను నాస్థలమున నాత్రీప్రతిమ సిద్ధమైయుండెను.

తుద కొకదినమున కున్నీసా యాశ నిరాశయైనది. ఆదిన మామెకుమాత్రమేకాక, యొక్కమారుగ బంగాళాదే

శమునకే గండాంతరమై యున్నది. భయంకరమగు చండమారుతము బంగాళాయందు మిగుల ననర్థమును గలుగఁజేసినది. వందలకొలఁది వంవత్సరములనుండి పెరిగి, గగనచుంబితములై నిలిచి వేనవేలు జీవరాసుల కాశ్రయములైయున్న యెన్నో వృక్షములు విరిగి పడిపోయెను. ప్రతిజంతువును, ప్రాణరక్షణముకై తిరుగాడుచు భయపడుచుండెను. తుద కప్పు డరణ్యమృగములుఁగూడఁ బరస్పర వైరభావమును విడిచి మందలు మందలుగా నెల్లదిక్కులకును బరుగెత్తుచున్నవి. భూమ్యాకాశములనడుమ ధూళీపటలముమాత్ర మేకాకారముగ నావరించియున్నది. ఉచ్ఛ్వాసనిశ్వాసములకైన వీలులేదు. కన్ను తెరచినచో బొత్తుగ నపాయకరము, ఇప్పటికాలపు కొందఱు పెద్దమనుష్యులవలె నప్పుడునుగూడ నేయువకుఁడైన కన్నులకు సులోచనములుంచి చూచినచో నట్టివారికన్నులకుఁగూడ ధూమ్రమమేగాని, సూర్యరశ్మి గానవచ్చుట లేదు. నడుమన డుమ నచ్చటచ్చట ప్రళయకాలమునందువలె ఘోరములగు పిడుగులు, మెఱుపులతోఁగూడిన కారుమేఘము లాక్రమించుచుండెను. సముద్రము హద్దుమీరిపొంగుచున్నది. గంగా బ్రహ్మపుత్రానదీతీరముల నెన్నో జనవసతులు మునిఁగిపోవుచున్నవి. నదీతరంగము లుద్రేకించుచున్నవి. చండమారుతము వలనఁ గలమరణసంకటమువలననో యనునట్లు వృక్షములన్నే

యు ధ్వనిచేయుచుండెను. ఇండ్లు, వాఁకిళ్లుఁ బోఁగొట్టుకొనిన
పేదవాండ్ర దీనధ్వనియు, దుష్టమృగముల ధూర్తధ్వనియు
బకకీచకులనుసంహరించిన సాహసభీముఁ డగుభీమసేనునకుఁ
గూడ హృదయస్ఫోటకము లైయున్నవి. పోనిమ్మ! బంగాళా
దేశపు (సైక్లోన్) సుడిగాలిని వర్ణించుటకు మాకుఁ దెలివి లేదు.

తుదకు మననిర్భాగ్యశిఖామణి యగుమీరఉన్నీసాకు
బ్రదుకు తెలివు లేదు. ఈ పేదబాలిక తనజీవరత్నమగు మూఁడు
వత్సరములబిడ్డను సందిటిలోనుంచికొని, పొంగిపొరలుచుఁ
బ్రవహించుచున్న గంగానదీతీరముననే పోయెను. ఉన్మత్త
చాలదూరమున లేదు. ఆమె దూరమునుండియే యున్నీసాను
గట్టిగాఁ బిలుచుచుఁ బరుగునవచ్చుచుండెను. భయంకరమగు
ఝంఝూమారుతముతో మాటాడుచున్న గంగామహాజనని
గంభీరధ్వనిలో నున్మత్తకుమారి కేకలు లీనమయ్యెను.

మీరఉన్నీసా గంగాతీరమునకువచ్చి తన్ను నది దాఁటిం
చి యవ్వలిదరిని విడిచి రక్షింపవలయు నని యటనున్న నావికు
ల నడిగెను. కాని, తనయొద్ద విషపానమునకుఁగూడ నొకకాసైన
లేకుండుటవలననామె కేవుసంగతియే ప్రశంసింపలేదు. అందు
వలననే వారినుండి సరియైనప్రత్యుత్తరము సకాలమున దొర
కుట కష్టమైనది. ఉన్నీసా యిట్లు నిర్గతిక యైనను, ఈవిషమసమ
యము.. నిమెవద్ద రెండుభూలోకస[illegible] లున్నవి. వానిలో నొకటి

మున్నహామగునట్టిచండమారుతాహతిచేఁ దనతల్లియొడిలో వె
చ్చగసుఖనిద్రఁజేయుచున్నది. మఱొకటి—ఒకానొక కాలమున
నున్న మీరఉన్నీసా పట్టమహిషీపదవిని సూచించుచున్నది.
ఈరెండుసొత్తు ఈ యొకరకములమునుండియెంతగాఢాంధకార
మందునఁగూడతళతళలాడుచునక్షత్రమువలెఁ బ్రకాశించుచుం
డెను. అప్పుడాయమూల్యరత్నాంగుళీయప్రభ యానావికుల
దృష్టికిఁ బాత్రమైనది. వారిలోఁ గొందఱీమె యెవరో గొ
ప్పయింటియువతియనియు, మఱికొందఱుదొంగిలించిపరువెత్తి వ
చ్చిన దాదియైయుండవచ్చు ననియుఁ దమతమ మనసునకుఁదోఁ
చినట్లు వివిధములుగ ననుకొనుచుండిరి. కొందఱు శ్లాఘ్యమై
న యీరత్నవిషయము నాలోచించి భయపడిరి. పలువురు గం
భీరమగు నీమెసౌందర్యమునకు బెదరిరి. మఱికొందఱు సర్కా
రుభయమునకు, వెనుకఁదీసిరి. తుదకొక్కమారుగా నెట్లయిన
ను భయంకరమై ప్రాణాపాయమును గలుగఁజేయునట్లు ఝుం
ఝూమారుతాహతిచే నల్లకల్లోలము లగుభాగీరధియందలి త
మదోనెలను నడపుటకు వెనుకఁదీసిరి. ఇంతలోనే ఉన్నీసాకు
మిగుల నాందోళనము గలిగెను. వెన్నంటివచ్చుచున్న
యాభేతాళము సమీపించెనేమో యని క్షణక్షణము
నకు వెనుదిరిగి చూచుచు వచ్చి, తుద కేమియుఁదోఁచకభ్రాం
తమై తన్ను నదిదాఁటించినవారి కాయంగుళీయకము నిచ్చు

నట్లు చెప్పెను. ధనాకాంక్షఁగల ధీవరుఁడగు నొకపల్లెవాఁడాము
లను సమ్మతించెను. దోనె తీరమునకువచ్చి యనుకూలమైనంత
దూరమున నిలిచి సిద్ధమైనది. ముగ్ధయగు మీరఉన్నీసా తనకు
నిలిచియున్న సర్వస్వరూపమగు జీవరత్నముతో గబుక్కుని
దానిలోపలకు దుమికెను.

మిగులనాత్రముతోఁ బరుగిడివచ్చుచున్న యసామా
న్య గంగాతీరమును చేరునంతలో నింతయుజరగిపోయెను. ఈ
మె యక్కడకువచ్చి క్షణముమాత్రము నిలుచుండి కొరకొర
లాడుచున్నేహోపకరణములతోఁగూడినతీక్ష్ణదృష్టితో యాదో
నెవైపునకే చూచుచు వచ్చినది.

అప్పుడు గంగాప్రవాహము పొంగి ప్రవహించుచు మ
హామారివలె నార్భటించుచుండెను. మఱియు నావర్తములకుఁ
జిక్కినవాని నన్నిటిని పాతాళమునకు ముంచివేయుచుండెను.
మఱికొంతదూరమునుండి వ్రేళ్లతోఁ బెల్లగిలినమహీరుహములు
మునుఁగుచుఁ దేలుచు వచ్చుచున్నవి. ఆవర్షకాలచండమారు
తవేగమునకు లోనైన భాగీరథీకోపమునకు బెదరి భూనివాసు
లగుమనుష్యమృగవృక్షాదులెల్ల తటస్థులై యున్నను, నీటి
గుఱ్ఱము, నీటియేనుఁగు, నీటిమనుష్యుఁడు, నీటికుక్క మొద
లగు జలచరజీవములుమాత్రము మిగుల నుల్లాసముతో గంగా
భవాని యార్ద్రాంతరంగమున నొప్పారుచుండెను. రిప్పారిప్ప

మని తటమునకువచ్చి కొట్టుచున్న తరంగమాలికానిస్వన
ముహాద్గురేసుంత మ్రోయుచున్న గంగాభవాని మం
గళసంగీతమునకు మృదంగధ్వనివలె నుండెను. గిరిరాజతన
య యగుగంగ నెట్లయినను ప్రసన్నగాఁ జేసికొనవలయు నని
దో, ఇహపరములందు సద్గతినిచ్చి తమ్ము రక్షించు ననుకృత
జ్ఞతవలననో, కాసిచో, నీమె తనపతి యగు మహాదే
వుని శిరస్సింహాసనముమీఁద నధిష్ఠించునంతటి యోగ్యతగల
మహానీయురా లను పూజ్యభావమువలననో, ఏదియో యొ
క కారణమువలన నాపూర్ణప్రవాహమహోల్లాసమయమున
నదీపార్శ్వములందలి నగరములలోను, గ్రామములలోను, ప
ల్లెలలోను, గలయువతులు గంగాపూజను సల్పుచుండిరి.
ప్రవాహమధ్యమమున నక్కడక్కడదీపపుదొన్నెలు తేలి వచ్చు
చున్నవి. ఆసంధ్యచీఁకటిలో నదీతరంగములపైఁ బ్రసరించిన
దీపపుకాంతులు భూలోకమునదిరుగాఁడు నక్షత్రములో యను
నట్లు ప్రకాశించుచున్నవి. ఘుమఘుమలాడుచున్న పూజాద్ర
వ్యములును, పుష్పములునుగూడ తండతండములుగాఁ గొట్టు
కొనివచ్చుచున్నవి. జనవసతిప్రాంతమునఁ గలసోపానముల
యందుమాత్రము కులకాంతలమంగళహారతిగీతములు గంగా
కలకలస్వనమునఁజేరి కర్ణరసాయనములుగ వినవచ్చుచున్న
వి. స్వేచ్ఛగాఁ జల్లబడిన హరిద్రకుంకుమపుష్పాక్షత లక్క

దక్షిణ పూజాస్థానములను సూచించుచున్నవి. కొంతవఱకు
గాలియును నిలిచినది. తుదకన్నియును మంగళకరముగానై
నవి. ఇట్లుండఁగా మీ రున్మత్తకుఁ గూడ నీతుంగభంగయు
గంగవలనే యెండలకు శుభము కాఁగూడదు? అదెందు
లకుకాదు? ఆమె భూలోకజీవనమునకు గంగయందే మం
గళము.

ఉన్మత్తకుమారి చూచుచుండఁగనే దానె యదృశ్యమ
య్యెను. భయంకరమగు నొకయార్తధ్వనిమాత్ర మామెకర్ణ
కుహరములఁ జొచ్చెను. తత్క్షణమే యామెయు నాపూర్ణప్ర
వాహమున దుమికెను. ఆయున్మత్తురా లాయున్మత్తప్రవా
హముతో నెంతయోసేపు పోరాడెను. అప్పటిసాహసము
స్త్రీస్వభావమునకు మీరియున్నట్లూహింపవచ్చును. మీఁద
మీఁద నామెయు నీదుచువచ్చినది. కాని, తనపైఁ జేయివై
చినదనుకోపముతో గంగాభవాని యాబాలికను శిక్షించుచున్న
దో యనునట్లు నానాముఖములనుండియు తరంగప్రహారము
లధికములగుచుండెను. ఎట్లయిన నేమి? దృఢసంకల్పము
నను మీరినదేదియును లేదు. ఒకటి రెండు నిమిషముల
కుఁబూర్వ మేస్థలమున దానె యదృశ్యమైనదియో, యచ్చ
టికే యున్మత్తయు వచ్చినది. ఆతరంగమాలికాంతర్భాగ
మున నొకయువతీకేశపాశము తేలియాడుచున్నట్లు కనఁ

బడినది. ధనికకుమారి తట్టునబోయి దానినిబట్టుకొని యొడ్డు
నకుఁ దీసికొనివచ్చెను. అప్పటికప్పుడే యామె స్పృహదప్పిన
దై యున్నది. అప్పుడు నట్టియాపత్సమయమునఁగూడ నున్నీసా తన
బహిఃప్రాణమైన చిన్నితనయను వక్షమునఁజేర్చి ప్రేమలతిక
లవలెనున్న తనచేతులతో భద్రముగఁ బట్టుకొనియుండెను.
ఉన్మత్త యాపిల్ల నీనలకుఁ దీసికొనవలయు నని తనయావచ్ఛ
క్తిని వ్యయపఱచినను నిష్ఫలమయ్యెను. ఆమె యీదుటయం
దు మిగుల పాండిత్యముగలదియగుటవలన, నెట్టితరంగము
లామాతాశిశువులను గొంపోయి తమ్ము నాశ్రయించి
యున్నమకరములు, మీనములు మొదలగు జలచరములకు
సమర్పింపవలయుననియున్నవో, యట్టితరంగములనే తన
భృత్యులనుగాఁ జేసికొని వానిసహాయమువలననే వారిరువురును
తీరమునకు వచ్చి చేరిరి. ఇట్లు వారిని పరామర్శించుటకు మూఁ
డుగంటలవేళ గడచినది. అప్పుడు చండమారుతవేగము క్షీణిం
చి ప్రకృతి సౌమ్యమైయుండెను. శుక్లపక్షపువెన్నెల పాలుజ
ల్లినవిధమున నాహ్లాదకరమై యున్నది.

అంతలోనే, వీరఉన్నీసా పరలోకప్రయాణముఁ జేయు
నైయున్నది. ఆమె యెట్టితనరక్తమాంసరూపమైన ప్రేమరాశి
నిదివఱకు సంభవించిన కష్టములనుండి దాటించి రక్షించు
చువచ్చెనో యట్టిభాగ్యరాశి యేమో యింక నుబ్రదికియున్నది.

అయిన నేమిఫలము ? ఉన్నీసా తనబిడ్డకొఱకు దానే బలియయ్యెను.

ఈజలప్రళయమున యసాధారణశాలినియగు నున్నీసాకూడ కాలధర్మమునొందియుండఁగా నామె మూఁడేండ్లముద్దుతనయమాత్రము బ్రదికియున్నదని పాఠకులకుఁ గొందఱాశ్చర్యపడవచ్చును. కాని, మూలతత్త్వమును దెలిసికొనిన నాయాశ్చర్యమంతర్ధానము కావచ్చును. ఆలోచించిచూడఁగా నాబిడ్డ దుర్బలమైనది. ఉన్నీసా దేహబుద్ధిబలములయందు సమర్థురాలు. ఇట్లయినను నింకొక గొప్పతారతమ్యముఁగలదు. శిశువులు తమదేహపోషణమునకు సంబంధించిన నిద్రాహారవిహారములయందలి శీతోష్ణాదులన్యూనాతిరేకములు మొదలగు కొన్నిసందర్భములయం దేర్పడుటమొదలగువానివలన తమదుఃఖమును బ్రకటించి యది తీరినతోడనే స్వస్థపడుచుందురు. ఇంతియె కాక, వారికేమనోవ్యాపారములును విశేషించియుండవు. వయోవంతులవిషయమై యిట్లు చెప్పుటవలనుపడదు. వయసు హెచ్చినకొలఁది కష్టసుఖములును హెచ్చుచు మనస్సునకుఁ బట్టుచుండును. అవి మితిమీరినచో ననర్థములు గల్పించుచుండును. అందువలన బ్రకృతసందర్భమునం దొకవేళ నున్నీసా కష్టపడి నీటినుండి తప్పించుకొని రాగలిగినదై యుండియు నాకష్టకాలమునఁ దనబిడ్డకు ముందెట్టిగతికలుగునో

యనుయోచన కలుగుటచే నా సుహృదయము చెదరిపోయి
యుండవచ్చును. దీనికిఁ దోడు గంగాభవాని మితిమీరినవిష
పానము నామె చేఁ జేయించియుండవచ్చును. ఈరెండిటిఫలి
తాంశము నీమె యనుభవించియుండవచ్చు నని చెప్పుట కెట్టి
సంశయమును దోఁచుట లేదు.

ఇఁక ముందీకథను విస్తరించి వ్రాయుటకు మాకిష్ట
ము లేదు. ఉద్దిష్టమగు శిశురత్నలాభము, నున్నీసా యకాల
మరణమును మనయున్మత్తకుమారికి నేకకాలమున హర్ష
విషాదములను గలుగఁజేసినవి. ఆమె మహారాజగు సిరాజు
ద్దౌలాను తండ్రిగా నెంచుకొనుచుండుటవలన నున్నీసానే తల్లి
యనియు, నాబాలికనే సోదరియనియుఁ దెలిసికొనవలసియు
న్నది. అయిన నట్లు చేయలేదు. ఆబాలికను తనగర్భమున
జనించినపుత్రిక యనియే భావించుకొనెను. స్వప్రహాతప్పి నిశ్చే
ష్టయైయున్న యాకిసుగాయు, యీమె కాలోచితోపచారముల
వలన నించుక సేదఁదేరెను. సమీపముననే దీర్ఘనిద్రఁ జేయు
చు పంకిలమగు నాగంగాతీరమునఁ బడియున్న యున్నీసావదన
కమల మట్టిజ్యోత్స్నాప్రభ యందుఁగూడ నిస్తేజస్కమై యు
న్నది. బాలిక జననీమ్లానవదనమును జూడఁగనే యాశవము
నొద్దకుఁ బరుగిడఁదొడఁగెను. ఆమెను బిలుచును. దీనస్వరము
తో నేడ్చును. ఏమేమి చేసినను తనజననిప్రేమవాక్యముల

నుండి ప్రత్యుత్తరము దొరకలేదు. ఈనడుమ శోకసంతప్త హృదయముతో బాష్పములు విడుచుచున్నయున్మత్త నూతన వదనము మఱియొకవేదనను గలుగఁజేయుచుండెను. అప్పు డాబాలికకుఁ గలిగినమనోవికారము సర్వసాక్షి యగుజగదీశ్వరుని చిత్తమునకుమాత్రమే విదితమైయుండనుగాని, మనవంటి యితరుల యూహాశక్తికి గోచరముకాఁజాలదు !

అటనుండి ముందుగ నున్మత్తకుమారి యున్నిసాకు పరలోకసహాయకము లగునుత్తరక్రియలలోఁ దనవలన సాధ్యమైనన్నిమాత్రము నెఱవేర్చినపిమ్మట నాబాలిక నెత్తుకొని పూర్వబంగాళము వైపునకు బయలుదేరెను. అందేస్థలమునందుండి యేమిచేయుచున్నవిషయములో మనకేమియును విశదముగఁ దెలియదు. అయినను నామెయాస్వీకృతపుత్రికను ప్రాణపదముగఁ బెంచుచున్నదని యాప్రాంతమున నంతటను పూర్వమునుండియు ప్రవాదమున్నది. అంతియేకాక పైనిఁజెప్పిన యామెసుగుణసాహసములను కనివినిన బంగాళాదేశీయులలో ననేకులు నేఁటివఱకును మనయున్మత్తకుమారిని, ఆమెకుఁ బ్రియతనయ యగుసిరాజబాలికనుగూడ తమగృహాదేవతలవలె పూజించుచుండిరి.

లోకములో సామాన్యముగ యువతులు దయాళులు ను, నితరులబాధలను సహింపఁజాలనివారును, నై యుండు

టవలన యువతిని గృహలక్ష్మి యన్నను చాలును. కాని, కొందఱు "స్త్రీలలోఁ బిల్లలతల్లులే విశేషకరుణాళు" లని యెన్నెదరు. ఇది యంత బాగుగఁ గనఁబడలేదు. ఏమనినచో— పురుషులలోఁగూడ విశేషమృదుస్వభావముఁగలకొందఱు ఇతరులకష్టమునుజూచినతోడనే కన్నీరువిడుచుచు జాలినొందుచుందురు. అట్టివారిని స్త్రీస్వభావముకలవారని పిలుచువాడుకఁ గలదు. ఈశబ్దమువలననే స్త్రీ కరుణామయి యని సులభముగా నిర్ణీతమైనది.

మఱొకవిధమున జూచినచో క్రుద్ధయగుకాంత మిగుల ననర్థకారిణి. స్త్రీకోపమున కనేకకారణము లుండవచ్చును. అందులో ముఖ్యముగ మనయార్యకులాంగనకు నిసర్గభూషణమైన తనపాతివ్రత్యమున కేమైనను భంగముగలుగునట్లు కనఁబడినచో నప్పుడుగలిగియున్న రౌద్ర మసాధారణమైయుండును. ఇట్టిసందర్భమునందు నాదుష్కార్యోద్యోగికిఁ దనకనులయెదుట మహాప్రతీకారమగునంతవఱకు నామెమనస్సు సుస్థిరముకాఁజాలదు. అందువలన పాతివ్రత్య మెంతవఱకమూల్యమైనదియు నూహించుటకు మనకిక్కడ కొంచెమవకాశమున్నది. లోకమందు సామాన్యముగ నల్పాపరాధములకై మహాప్రతీకారబుద్ధిపుట్టుట యరుదు—భరతఖండనివాసు లగు మనయార్యులకును మహమ్మదీయులకును నీపాతివ్రత్యమహి-

ము దెలియకయేయుండదు. అయినను చపలయౌవనోత్కటయు
వసవితంతువునకుఁ దన్మతానుసారముగ పునర్వివాహము స
మ్మతమైయుండుటవలన పతివియోగానంతరము పునర్వివాహ
ముజరగినచో నాపూర్వపతియందున్న యనురాగము క్రమక్ర
మముగ క్షీణించిపోవుట సంభవించుచుండును. మనయార్య
కులకాంతలకో, సామాన్యముగ నట్టియవకాశము లేదు. మన
కులవధువు తననాథుఁ డిహపరములం దెక్కుడైన నుండని
మ్మె. ఆతనినే పరదైవతమని యూహించును. తన మిగిలిన
జీవితకాలము నంతయు నాతనిధ్యానముననే గడపును. తనపా
తివ్రత్యమును ప్రాణతుల్యముగఁ జూచుకొనును. ఇట్లుండుట
వలననే మనకులకాంతలు నాథునిపుణ్యఫలములందుఁ గూడ
నర్ధభాగినులై యుందురు. ఈసద్గుణమైనపాతివ్రత్యమును కా
పాడుకొనుటకొఱకే సీత, దమయంతి, మొదలగుసాధ్వీమణులు
పలుకష్టముల ననుభవించిరి. దీనిప్రభావమువలననే కదా సావి
త్రి తనపతి యల్పాయువును దప్పించి యాతని దీర్ఘాయుష్మం
తునిగఁ జేసినది! వీరపత్నులనియు, వీరమాతలనియు జగత్ప్ర
సిద్ధలై యున్న రాజపుత్రకులరమణీమణు లీపాతివ్రత్యరక్షణా
మునకే కదా యాత్మనాశమును జేసికొనియుండుట! ఈపాతి
వ్రత్య మనురత్నమేకదా భారతభూమి కౌరసపుత్రులైన యా
ర్యులను ధర్మపత్నులైయున్న ప్రతికులస్త్రీవ్యూహము పేటికయం

దును నణఁగియున్నది. ఓహో! దీనిని రత్నమనకూడదు. ఎం
దుచేత ననఁగా —ఇందు రత్నమునకుమీరిన విలక్షణప్రభా
వ మున్నది. ఏమనఁగా—రత్నము పెట్టెయందుంచి పైకి దీ
యు నప్పుడుమాత్రము ప్రకాశించును. అది యట్లుకాదు. హృ
దయ పేటికయం దణఁగియున్నను, లోపలను వెలుపలనుకూడ
తనప్రభావమును ప్రకటింపఁగలుగును. అంతియేకాక యీ సన్మా
ర్గప్రవర్తకులకుమాత్రము సంతోషజనక మగుమాణిక్యము.
కుజనసంతానానశ్యాకును బూర్ణాహుతిఁ జేయఁజాలిన మహా
ప్రభావముఁగలయగ్నికణము.

స్త్రీలపాతివ్రత్యమును కొనియాడుసందర్భమున పురుషు
లలోఁ గొందఱు తమధర్మపత్నులకు ద్రోహముఁ జేసి పరస్త్రీ
కాముకులై చేయుదురాచారములను దూషింపకుండ విడుచు
ట కిష్టము లేదు. ఈమహాపాపకృత్యమువలన నిహమం దర్థ
నాశనము, నగౌరవము, నపఖ్యాతి, భయంకరరోగము, వీనిని
మీరినచోఁ బ్రాణహాని, ఇట్లగుటయేకాక తమదౌర్భాగ్యము
వలన నిట్టిదురాత్ములగుభర్తలను జేపట్టిన వీరిధర్మపత్నులు వీ
రిబిడ్డలు, బిడ్డలబిడ్డలు, తుదకు వంశమే రోగమునకుఁబుట్టి ని
ల్లయి, క్రమముగా క్షీణగతికి వచ్చుననుటకు సంశయము లే
దు మఱియు నీపాపాత్ములకుఁ బరలోకశిక్ష యనుభవైకవే
ద్యమై యున్నది.

ఇంతే కాక, యీపతితపురుషులకు తమయౌవనోత్క-
టావస్థయందు నింక నిట్లే వ్యభిచారమువలన సంచరించినను
తుదకు దమధర్మపత్నుల యాశ్రయమునే బడసి వారినే ప్రే
మింపవలసియుండును. మొదటినుండియు నిట్లే ప్రేమించియున్న
చో నీదంపతులు మాత్రమేగాక సంసారముగూడ నెట్టిసుఖసం
తోషములలో మునుగవలసినదై యుండును! పైని చెప్పినకష్టనష్ట
ములలో నేవియైనను దగ్గరకు రాగలవా?

వెనుక చెప్పినట్లు స్త్రీలు మనుష్యస్వభావములకు లోం
బడినకృపాకోపములలో నేమియును వెనుకంబడియుండ లేదు
గదా! కాక, సామాన్యముగ వీరిబుద్ధియు చురుకైయుండు
ను. బుద్ధిశక్తులలో పురుషులకుసమానులనియు దేహబలమం
దుమాత్రము హీనలనియు తెలియవచ్చుచున్నది. కాని, కొ
న్ని యవసానసమయములలో ప్రకటింపబడుచుండు స్త్రీసాహస
మొంతశూరపురుషుని సాహసముకంటెను న్యూనమైయుండదు.
స్వభావమును మాఱియై కష్టసహిష్ణుతలు లేనియువతి కాదాచిత్క-
ముగా జరుగునట్టి శరీరసాహసమున కాసమయమునందు సంభ
వించిన సన్నివేశములు మనోదార్ఢ్యములు మొదలగునవే ప్రబల-
కారణములైయున్నవి.

ఇట్లే స్త్రీపురుషభేదములేని మానవజాతిసామాన్యము
నం[illegible]తటను నెలకొనియున్న యితరసుగుణములెన్నో యుండు

ను. వానిలో ఉపకారబుద్ధి,, అనునది యొక ముఖ్యగుణముగ
పరిగణింపవచ్చును. ఉపకారమనగా—ఇతరులకు సకాలమున
యథోచితమైన సహాయమును జేయుట. సాధారణముగ సూ
క్ష్మదృష్టితోఁ జూచినచోఁ బ్రపంచమందున్న జనులందఱు ప
రస్పరోపకారులే యైయుందురు. ఒకపట్టణమం దెవ్వరో యి
రువురుగృహస్థు లిల్లుకట్టుకొని యుండిరనియు వారిప్పుడు పర
స్పరపరిచయము లేకుండనుండి రనియుభావించుకొన్నను వారి
రువురుఁ బరస్పరోపకారులే యైయుందురు. ఎట్లనిన—ఒకరు
మొదట నాప్రదేశమునకువచ్చి గృహముఁగట్టుకొనుటవలననే
గదా యితరులుఁగూడ నక్కడకువచ్చి తాము ను ధైర్యముగ
నచ్చటనే యిల్లుఁగట్ట యత్నించుట? ఈతీరున నొకదానియొద్ద
నొకటిగఁ జాలగృహములు చేరి యది యొక గ్రామమైనట్లు
గనే మృగములుగాని దొంగలుగాని వచ్చి కొల్లగొనుట కవ
కాశము లేకుండుట చూచితిరా? ఇట్లే యపరిచయస్థులకుఁ
[illegible]క పరంపరసంబంధమువలన నన్యోన్య మేర్పడిన నొకయు
[illegible]ండియే యుండును. అయినను వీనినన్నిటి నుపకా
[illegible]రోఁబిలుచుట వాడుక లేదు.

[illegible] జేయుటయందును నెంతో తారతమ్యము
[illegible]కుపకారముఁ జేయుదురో. యట్టివారి
[illegible] లభించు ననునాశతో నట్లు

ప్రవర్తింతురు. కొందఱు తాము మఱియొకరినుండి పొందిన యుపకారమునకు ప్రత్యుపకారముఁ జేయుదురు. ఇది కృతజ్ఞతను సూచించుచున్నది. మఱికొందఱు తామితరులవలనఁ గీడు నేననుభవించియున్నను. తిరిగి యాయపకారుల కెన్నియో యుపకారములను జేయుచుందురు.

వీరిలో నీతుదను జెప్పినవారే మహాత్ములు. వీరు నివసించు ప్రదేశ మెంత గ్రాకామమైనను, పుణ్యభూమియనియు, వీరి జీవితకాల మెంత కలికాలమైనను కృతయుగమే యనియుఁ జెప్పుటకు సంశయము లేదు.

ఎంత రాచినఁ జందన ♦ మిచ్చుఁ బాపి;
ఎంత గాల్చిన బంగార ♦ మిచ్చు వన్నె;
ఇది మెఱిఁగిన పెద్దలే ♦ యెఱుక విడిచి;
యహిత మొనరింతు రేలకో ♦ యుపకృతులకు?

సంపూర్ణము.



# రస సృష్టిలో సౌందర్య సాంకేతిక పదాలు

ప్రకృతిలో సౌందర్యం ఉంది.

ప్రకృతిలో దొరికే ముడిపదార్థంలో సౌందర్యం లేదు.

కానీ—

సౌందర్యరహితమైన ఆ జడపదార్థానికి రసజగత్తులోని రస స్పర్శ తగిలితేచాలు దానికి సౌందర్యతత్వం అబ్బుతుంది.

అప్పుడు—

'పదార్థానికి— సౌందర్యతత్వానికి' మధ్య జరిగే సృష్టిలో, కొన్ని అందమైన అంశాలను తెలిపేమాటలు పుట్టుకొస్తాయి.

ఆ మాటలూ, వాటి గుణాలూ—

జడపదార్థానికి సౌందర్యతత్వానికి మధ్యా,

కళాసృష్టి చేసేటప్పుడూ,

సృష్టి తరువాత దానిని గురించి మాట్లాడుకునేటప్పుడూ,

వాహకంగా ఉపయోగపడతాయి.

కళాతత్వంలో అలా వాహకంగా ఉపయోగపడే ఆ మాటలలో సౌందర్యతత్వం యొక్కా, దాని నిర్మాణంలోని నిపుణత యొక్క సాంకేతికతా; నిండి వుంటుంది.

విశిష్టతత్వంగల ఆ మాటలు రసజగత్తులోని
కళాకారుల మధ్యా
రసజ్ఞుల మధ్యా
కళామీమాంసకుల మధ్యా
సౌందర్యనిపుణ వాహకమైన మాటల

భాషగా చెలామణి ఔతూఉంటుంది.

ఆ భాషలో సాంకేతికసౌందర్య మర్మజ్ఞతా, సౌందర్యంలోని సాంకేతిక సాంకేతభావనా ఉంటుంది. దాని అవగాహనపైననే రసజ్ఞుల రసజ్ఞతయొక్క వ్యక్తీకరణ స్థాయి చాలావరకు ఆధారపడి ఉంటుంది.

కళాసృష్టిలో కళాకారునియొక్క మానస్థితి మాదిరే; రసజ్ఞుని యొక్క కళాస్వాదనకూడా అవ్యక్త ఆనందంతో కూడి ఉంటుంది.

ఆ స్థితి దాటిన తరువాతనే, కళాకారునీ రసజ్ఞునీ మెళుకువలో, కళను గురించి వ్యాఖ్యానించే వ్యాఖ్యానంలో, ఈ సౌందర్య సాంకేతిక భాషాపదాలు ఉంటాయి.

వాటి అవగాహనతో —
కళానిర్మాణ సాహిత్యాన్ని,
కళా రసజ్ఞ సాహిత్యాన్ని,
కళా మీమాంసా సాహిత్యాన్ని,
మనం చక్కగా చదువుకోవచ్చు.

సాధారణంగా ఆయా కళానిర్మాణ సాహిత్యమూ, కళా మీమాంసా సాహిత్యమూ, పరాయి భాషలో వ్రాసిన రచనలవలె ఉంటాయి. అలాంటి సౌందర్యసాంకేతిక భాషలోని కొన్ని పదాలతోనైనా ప్రాథమికమైన పరిచయం మనం చేసుకొని ఉంటే, కళలోగల సౌందర్య సాంకేతిక

తత్వం లేక సాంకేతికసౌందర్యతత్వం మనతో చక్కగా మాట్లాడ గలదు. మనమూ దానితో మాట్లాడగలము. దానివల్ల మనలో కొంత వరకు సాంకేతిక అవగాహన ఏర్పడటానికి ఎంతో అవకాశం ఉంటుంది.

## 2

దైనందినభాష తన వ్యక్తీకరణతో, తన భావాన్ని సాదాగా చెప్పటంతో తృప్తిపడక; ఇంకా బాగా అందంగా హృదయానికి హత్తుకొనేలా చెప్పాలనే తపనలోనుంచి సాహిత్యం పుట్టింది.

అలా సాహిత్యం పుట్టినప్పటినుంచి ఆ సాహిత్యంలో ఎన్నో అందచందాలు సృష్టించబడ్డాయి. ఆ సృష్టిలో ఎన్నో సౌందర్యతత్వపు అంశాలు లక్షణాలుగా రూపొందాయి. అవి సాహిత్య సృష్టిలో అంతర్గర్భితమై మౌనంగా పనిచేస్తూ ఉన్నాయి. వీటి బలంతోనే సాహిత్యం తన అక్షరగానాన్ని మధురంగా మనకు వినిపిస్తూ ఉంది.

సాహిత్యసృష్టి వినసొంపునకే కొంచెం ఎక్కువ ప్రాధాన్యతను మొదటినుంచి ఇస్తూ వచ్చింది. అందుకనే సాహిత్యంలో పద్యం, గేయం, పాట, అన్న రూపాలు రూపొందాయి. వాటిలో గణయతిప్రాసలూ, మాత్రఛందస్సులూ లయలూ, విభిన్నమైన నడకలూ అన్నవి ఉన్నాయి.

పద్యంలో గణయతిప్రాసలు 'ఛందస్సు' అఛందస్సు. మర్మగర్భంగా విశిష్ట సౌందర్యాన్ని పద్యానికి కూరుస్తూఉంది. ఛందస్సులో గణగణసమ్మేళనంలో ఓ అందమైననడక ఉన్నది. పద్యపాద ప్రథమాక్షర శబ్దానికి కొంతదూరంలో అదేశబ్దం రావటం 'యతి'. యతిస్థానంలో శబ్దం పునరావృతమవటం ద్వారా పద్యపాదానికి కొంత సౌందర్యం వస్తుంది. అలాగే పద్యపాద రెండవ అక్షరమైన 'ప్రాసాక్షరం' నాలుగు పాదాలలో సమత్వాన్ని ఉత్పత్తి చేయటంవల్ల సుశ్రావ్యతపద్యంలో పుట్టూ ఉంటుంది.

ఈ ఛందోనియమాలు దాటిన తరువాత, పద్యంలోని ప్రతిపాదం మొదటిలోగానీ, మధ్యస్థలంలోగానీ, అంత్యంలోగానీ, ఒకే శబ్దావృతియైన పదాలతో పద్యం అలంకరింపబడితే, అది 'యమకం' ఔతుంది. అది ఓ విలక్షణమైన శబ్ద సౌందర్యాన్ని ఇస్తుంది పద్యరచనలో.

పద్యరచనా ఛందస్సులో మార్గదేశీ ఛందస్సులు అని రెండు విధాలు ఉన్నాయి. సంస్కృత ఛందస్సులోని వృత్తఛందస్సు అంతా 'మార్గఛందస్సు' క్రిందకు వస్తుంది. వృత్త ఛందస్సుకాక మిగిలిన అన్ని పద్యాల ఛందస్సులూ 'దేశీ ఛందస్సు' క్రిందకు వస్తాయి.

ఈ ఛందస్సులోనే ఛందో నైపుణ్యాన్ని తెలిపే 'చిత్రకవితారీతులు' ఉన్నాయి. అందులోఉన్న ఛందాలలో గర్భఛందస్సు ఒకటి. బంధఛందస్సు ఎన్నో విచిత్రాలను కలిగిఉంటే, 'గర్భ ఛందస్సు' అన్నది ఒక పద్య ఛందస్సులో మరోపద్య ఛందస్సును కలిగి ఉంటుంది. దానిని విడమర్చి చూస్తేనేగానీ ఈ ఛందోమర్మం అవగతం కాదు. పద్యాలను అప్పటికప్పుడు అల్లి చెప్పటం 'ఆశువు' అవుతుంది.

గణయతి ప్రాసలులేని క్రమమైన' రచన 'గేయం.' దానిలోని సౌందర్యం మాత్రాఛందస్సుమీద ఆధారపడి ఉంటుంది. 'మాత్రా ఛందస్సు' అంటే, నియమిత మాత్రలను కలిగిఉండేది. 'మాత్ర' అంటే చిటికె కాలపుకొలతలను కలిగి ఉండేది. ఈ మాత్రాఛందస్సులో ఎన్నో రకాలైన మాత్రల నడకలు ఉన్నాయి. వాటివలన ఎన్నో శబ్ద సొగసులు, సుందరమైన పదాల నడకలు పుట్టున్నాయి.

సంగీత సాహిత్యాలు కలిసినచోట పాట పుట్టూ ఉన్నది. తాళానికీ లయకూ అనుకూలమై స్వరరచన చేసుకొనుటకు అనువుగా ఉండు రచన 'పాట'.

వచనగేయము అన్నది గణయతి ప్రాసల ఛందస్సును; మాత్రా ఛందస్సులోని నియమాలనూ పాటించకుండా అన్ని ఛందో బంధాలను తెంచుకొని స్వేచ్ఛగాచేయు గద్యముకాని రచన 'వచన గేయము' ఇందులో ఒకరకమైన ధార ఉంటుంది.

సాధారణంగా వచనం కాని రచనలలో లయ ఉంటుంది. ఆ 'లయ' సాహిత్య శబ్దాల కదలికలలో నుంచి పుట్టూ ఉంటుంది.

సాహిత్యంలోని ఏ రచనా విధానమైనా ఆ రచనలో 'ధార' ఉంటే అది పాఠకుని చక్కగాచదివిస్తూ తనతోబాటు పాఠకుని తీసుకుపోతుంది

పద్యరచనా ఛందస్సులో మార్గదేశీ ఛందస్సులు అని రెండు విధాలు ఉన్నాయి. సంస్కృత ఛందస్సులోని వృత్తఛందస్సు అంతా 'మార్గఛందస్సు' క్రిందకు వస్తుంది. వృత్త ఛందస్సుకాక మిగిలిన అన్ని పద్యాల ఛందస్సులూ 'దేశీ ఛందస్సు' క్రిందకు వస్తాయి.

ఈ ఛందస్సులోనే ఛందో నైపుణ్యాన్ని తెలిపే 'చిత్రకవితారీతులు' ఉన్నాయి. అందులోఉన్న ఛందాలలో గర్భఛందస్సు ఒకటి. బంధఛందస్సు ఎన్నో విచిత్రాలను కలిగిఉంటే, 'గర్భ ఛందస్సు' అన్నది ఒక పద్య ఛందస్సులో మరోపద్య ఛందస్సును కలిగి ఉంటుంది. దానిని విడమర్చి చూస్తేనేగానీ ఈ ఛందోమర్మం అవగతం కాదు. పద్యాలను అప్పటికప్పుడు అల్లి చెప్పటం 'ఆశువు' అవుతుంది.

గణయతి ప్రాసలులేని క్రమమైన' రచన 'గేయం.' దానిలోని సౌందర్యం మాత్రాఛందస్సుమీద ఆధారపడి ఉంటుంది. 'మాత్రా ఛందస్సు' అంటే, నియమిత మాత్రలను కలిగిఉండేది. 'మాత్ర' అంటే చిటికె కాలపుకొలతలను కలిగి ఉండేది. ఈ మాత్రాఛందస్సులో ఎన్నో రకాలైన మాత్రల నడకలు ఉన్నాయి. వాటివలన ఎన్నో శబ్ద సొగసులు, సుందరమైన పదాల నడకలు పుట్టున్నాయి.

సంగీత సాహిత్యాలు కలిసినచోట పాట పుట్టూ ఉన్నది. తాళానికీ లయకూ అనుకూలమై స్వరరచన చేసుకొనుటకు అనువుగా ఉండు రచన 'పాట'.

వచనగేయము అన్నది గణయతి ప్రాసల ఛందస్సును; మాత్రా ఛందస్సులోని నియమాలనూ పాటించకుండా అన్ని ఛందో బంధాలను తెంచుకొని స్వేచ్ఛగాచేయు గద్యముకాని రచన 'వచన గేయము' ఇందులో ఒకరకమైన ధార ఉంటుంది.

సాధారణంగా వచనం కాని రచనలలో లయ ఉంటుంది. ఆ 'లయ' సాహిత్య శబ్దాల కదలికలలో నుంచి పుట్టూ ఉంటుంది.

సాహిత్యంలోని ఏ రచనా విధానమైనా ఆ రచనలో 'ధార' ఉంటే అది పాఠకుని చక్కగాచదివిస్తూ తనతోబాటు పాఠకుని తీసుకుపోతుంది

ఒప్పించి మెప్పించగలగటం 'వాస్తవ సౌందర్యం' అయితే; ఉన్న వస్తువు లేక విషయ సౌందర్యాన్ని ఎంతో అతిశయింపజేసి ఆర్ద్రి పరచటం 'ఆదర్శ కాల్పనిక సౌందర్యం' అవుతుంది.

ఈ సాహిత్యకళలోని సౌందర్యం అంతా, సందర్భాను సారంగా విషయానికీ వస్తువుకూ తగినరీతిలో ఒప్పి ఉండటం 'ఔచితి' అవుతుంది. అలంకారాలలో వర్ణనలలో రచనలో భావ వ్యక్తీకరణలో గజిబిజి లేకుండా స్పష్టంగా ఉండటం 'స్ఫుటత' ఔతుంది.

రుచిగా వంటచేయటం ఒక్కటే అయినప్పటికీ, ఒక మనిషి చేసిన వంటకూ మరోమనిషి చేసినవంటకూ తేడా ఉంటుంది. అలానే సాహిత్య రచనలో భాష ఒక్కటే అయినా, ఆ భాషను వంటలావండి రచనను పండించే విధానాల్లో తేడాలు ఉంటాయి. ఆ తేడాల వల్లనే సాహితీజగత్తులో 'పాకము' అన్నది పుట్టూ ఉన్నది. ఒక మనిషి మాట్లాడినదానికి మరో మనిషి మాట్లాడినదానికీ తేడా ఉన్నట్లుగానే, రచనా కౌశలములోనూ భాషా సరళిలోనూ, భాషా సౌష్టవములోనూ తేడాలు ఉన్నవి. ఒక వ్యక్తికీ మరోవ్యక్తికీ రూపురేఖల్లో తేడా ఉన్నట్లు, ఓ కవి రచనారీతికీ మరొకవి రచనారీతికీ విభిన్నత ఉంటుంది. ఆ విభిన్నతే ఆ రచయిత 'శైలి' అవుతుంది సాహితీ జగత్తులో. రచనలు తమ భావాన్ని చదువరికి అందించే తీరు తెన్నులలో కొన్ని తీవ్రంగా ఉంటాయి. మరికొన్ని రచనలు తియ్యగా ఉంటాయి, మరికొన్ని రచనలు సౌమ్యంగా ఉటాంయి. ఇవి ఆయా రచనా రీతులలోని 'గుణాలు' ఔతాయి.

రచనా నిర్మాణంలో ఇలాంటి ఎన్నో లక్షణాలను కలిగిన రచనా విధానం సాహిత్య శిల్పం ఔతుంది. అంటే సాహిత్యాన్ని సృష్టించే తీరు తెన్నుల లక్షణాలన్నీ 'సాహిత్యశిల్పం' అన్న అంశం క్రిందకు వస్తాయి.

సాహిత్య జగత్తులో కొన్ని భావాల సంయోగము వలనా ఆ సంయోగము ఉచ్చస్థాయిని పొందినపుడు 'రసము' అన్నది జన్మనెత్తుతున్నది. కొన్ని సందర్భాలలో ఒక రసము ప్రధానముగా ఉంటూ, మరి

కొన్ని రసములను కూడా అచ్చటి అవసరాన్నిబట్టి ఆ ప్రధానరసము నంతరించుకొంటుంది. అప్పుడు ఆ ఉపరసాలు 'అనుషంగిక రసాలు' గా చెలామణి ఔతుంటాయి. అలానే అనేక భావాలవలన జన్మనెత్తిన రసము చుట్టూ భావాలు ఉండి ఆ భావాలు ఒకదానితో ఒకటి కలిసిపోతూ ఉంటే ఆ భావాలు 'వ్యభిచారీ భావాలు' అవుతాయి. అసలు ప్రధానభావం చుట్టూ అందంగా తిరుగుతుండే ఉపభావాలు అన్నీ 'సంచరీభావాలు' అవుతాయి.

సాహిత్యంలో ఎన్నో భావాలవలన పొందిన మానసిక అనుభవము తరువాత మనలో పుట్టిన అవ్యక్తతే 'అనుభూతి'. ఈ అనుభూతిముందు గల భావరస తదాత్మ్యతలో ఆ భావరసాలకు అనుకూలమైన ఆసాద్వి యొక్క ఇంద్రియాల ప్రతిస్పందనే 'స్థాయీ భావన' అవుతుంది.

సాహిత్యజగత్తులోని ఈ సాంకేతిక సౌందర్యాత్మక అంశాలన్నీ సాహిత్యం అని చెప్పబడే రచనల్లో ఆ నాటినుండి ఈ నాటివరకూ సాహిత్య నిర్మాణ అంశాలుగా వస్తూనే ఉన్నాయి. వీటికి ప్రాచీనమూ అధూనా తనమూ అన్న భేదంలేదు. ఇవి సాహిత్యరచనలో సర్వకాలల్లోనూ పరికరాలుగానూ పదార్థాలుగానూ ఉంటున్నాయి. దేశకాలాలనుబట్టి వాటి రూపురేఖల్లో విభేదముతప్ప, గుణంలో రుచిలో తేడా ఉండదు.

నిజానికి సాహిత్యాన్ని గురించీ వాటి లక్షణాలను గురించీ చెప్పే అలంకార శాస్త్రాలన్నీ సాహిత్య విజ్ఞానశాస్త్రాలూ, సాహిత్య సాంకేతిక శాస్త్రాలూ అని అనటం అంత తప్పుకాదేమో, సాహిత్య రచనా పరిశీలనలో—

* * *

మధురమైన గీతాలను తియ్యగా ఆలపించటంలోనుంచే సంగీత పుట్టింది. అందుకనే 'సంగీతం' అంటే గీత, స్వర, రాగ, తాళముల కూడిక ఐంది.

సంగీత కళలోగల 'సప్తస్వరాలు' అన్నవి విభిన్నమైన స్వత ధ్వనులు. 'స్వరము' అంటే తనకుతానుగా శ్రోతను ఆనందపరచునది. ప్రతి స్వరానికీ స్థాయి అన్నది ఉన్నది. 'స్థాయి' అంటే వ్యాపించుట,

సంకోచించుట, సమముగా ఉండుట అను లక్షణములు గలది. మంద్ర (తక్కువ) స్థాయిలోని స్వరాలు వ్యాపించు లక్షణంగలవి. తార(హెచ్చు) స్థాయి స్వరాలు సంకోచించు లక్షణం గలవి.

సంగీతకళ శృతి అన్న భూమికమీద ఎక్కువగా ఆధారపడి ఉన్నది. సప్తస్వరాలలో 'ఆధార షడ్జమము' అంటే మొదటి స్వరము, లేదా మొదటి స్వరముయొక్క ధ్వనివిశేషము, లేక స్వరావయవ ప్రారంభ మునగల ఓ కమ్మని ధ్వని. అదే 'శృతి' అవుతుంది. ఆ ప్రారంభ ధ్వనిలో శ్రావ్యత లేకపోతే అది 'అపశృతి' ఔతుంది.

సంగీతకళకు పదార్థాలైన స్వరాలలో ప్రకృతిస్వరాలూ వికృతి స్వరాలూ అని రెండురకాలు ఉన్నాయి. విభేదములేని స్వరము 'ప్రకృతి స్వరము.' విభేదముగల స్వరము 'వికృతిస్వరము'. అంటే, వికృతి స్వరము శుద్ధముగా ఒక్కటేఐనా, ఆ స్వరానికి పైా క్రిందాగల శృతులతో ఆ స్వరం పలుకుతూ, మూలస్వరనాదానికి కొంచెం విభేదంగాఉంటూ శ్రావ్యంగాకూడా ఉంటుంది. అందుకని అది వికృతిస్వరం అయిందేతప్ప అది వికృతస్వరం కాలేదు. ప్రకృతిస్వరము ఎల్లప్పుడూ ఒకే విధానం పలుకుతుంది. ఆ ధ్వనిస్థానంతప్పి కాస్త పైకీ క్రిందికీ జరిగితే అందులోని సుందరప్రకృతి అసుందరమౌతుంది. అందుకని ప్రకృతిస్వరాలు స్థిర స్వరాలు. వికృతిస్వరాలుచరస్వరాలు అయినవి. రాగవిస్తరణకు ఈ వికృతి స్వరాలే ఎక్కువ అవకాశాన్ని కలిగించాయి.

వివిధమైన స్వరసమ్మేళనములవలన అనంతమైన రాగాలు ఏర్పడు తున్నాయి. రాగములో స్వరాల ఆరోహణ అవరోహణలు ఉన్నాయి. 'ఆరోహణ' అంటే క్రిందినుంచిపైకి స్వరాలుపోవుట. పైనుండిక్రిందకు స్వరాలు ప్రయాణించుట 'అవరోహణ'. ఈ ఆరోహణ అవరోహణలు కలిసి 'మూర్ఛన' అవుతుంది. ఇలాంటి స్వరసమూహ మూర్ఛనలతో ఏర్పడినవి 'గ్రామములు' అనబడతాయి. గ్రామములోని స్వరాలను అందమైన మెలికలతో దాటులతో అల్లబడినది 'జాతి' అవుతుంది. అందము కొరకు రాగము రంజించుటకు, క్రమస్వరములమధ్య ఒక

స్వరమునుగానీ, రెండు స్వరములనుగానీ లేక కొన్ని స్వరములనుగానీ విడిచిపెట్టి సాగిపోవుట 'దాటుస్వరము' అనబడును.

గానకళా జగత్తులో రాగములు అనంతమైనవిగా విస్తరించి ఉన్నవి. రాగములోని ఆరోహణ అవరోహణలలో సప్తస్వరాలు పూర్తిగా ఉన్నప్పుడు అవి 'సంపూర్ణరాగములు'గానూ; ఆరు స్వరములు మాత్రమే ఆరోహణలో అవరోహణలలో ఉన్నప్పుడు అవి 'షాడవరాగములు'గానూ; అలానే ఐదు స్వరములు ఆరోహణ అవరోహణము లందు ఉన్నప్పుడు అవి ఔడవ రాగములు'గానూ వ్యవహరింప పడుతుంటాయి.

వికృత స్వరములలోని శృతి భేదముల వలన శుద్ధము, చతుశ్శృతి, షట్శృతి, భేదములు; సాధారణ, అంతర, భేదములు; మధ్యమ ప్రతి మధ్యమ, కైశికి, కాకలీ విభేదములు అన్నవి ఏర్పడుచున్నాయి ఆ విభేదముల వలన రాగములు జనకరాగములుగానూ, లేక మేళకర్త రాగములుగానూ, జన్యరాగములుగానూ, భాషాంగరాగములుగానూ, విస్తరించినవి. 'జనక రాగము' అంటే, ఆరోహణ అవరోహణములలో సంపూర్ణ స్వరములు శృతి భేదములతో ఉండుట. ఇది మూలరాగము క్రింద లెక్క. జన్యరాగము అంటే జనకరాగములోని ప్రకృతిస్వరముల విభిన్న తరహా మూర్ఛనల కూర్పు భేదములతో పుట్టినవి 'జన్యరాగములు'. ఇక భాషాంగరాగము అంటే రాగానికి నిర్దేశింపబడిన ఆరోహణ అవరోహణ స్వరములలో ఒకటిగానీ రెండుగానీ శృతి భేదముగల అన్య స్వర ప్రయోగము గలది 'భాషాంగ రాగము'. రాగముయొక్క ఆరోహణలోగానీ, అవరోహలోగానీ, క్రమముగా ఆరోహించుట గానీ, అవరోహించుటగానీ లేక ఎగుడు దిగుడుగా స్వరములు ఉన్నప్పుడు అది 'వక్రరాగము' అగును.

రాగములో ఆ రాగానికి నిర్దేశింపబడిన స్వరాలూ, ఆ స్వరాల గతిలో నిర్దేశితమైన ఆరోహణ అవరోహణములు గల మూర్ఛన ఉండును. దానివలన ఆ రాగ స్వరూపము వ్యక్తమగును.

